# కొయ్యగుర్రం

ఆధునిక కావ్యం



నగ్నముని

కొయ్యగుర్రం చిత్రకారులు




మనోహన్‌దత్ రమణ జీవి

KOYYA GURRAM
Epic in Telugu by
NAGNAMUNI

Cover & book designed by
Ramana Jeevi

Printed at
Charitha graphics

Copies available at
Prajaswamya Prachuranalu
M.S.87, Malakpet Colony, Hyderabad-5000 36
Phone: 9441081922

Visalandhra Book House, All Branches
Prajasakthi Book House, All Branches
Navayuga Book House
Navodaya Book House
Disa Book Centre
Telugu Book House
All leading Outlets

Rs. 40/-

## ఇందులో ఈ క్రమంలో...





కొయ్యగుర్రం
కొన్ని వివరాలు

రచనాకాలం : నవంబరు 1977
ఆకాశవాణిలో ప్రసారం : నవంబరు 1977
ప్రజాతంత్ర వారపత్రికలో ప్రచురణ : జనవరి 1978
పుస్తకరూపంలో మొదటి ముద్రణ : మార్చి 1980
రెండవ ముద్రణ : నవంబరు 1998
మూడవ ముద్రణ : జనవరి 2007

ఇప్పటివరకు–
రష్యన్, ఇంగ్లిష్, హిందీ, పంజాబీ, మరాఠీ, మైథిలి, ఒరియా, తమిళం, కన్నడం భాషల్లోకి అనువాదమైంది.

ఇప్పటివరకు–
కొయ్యగుర్రం పై వెలువడిన గ్రంథాలు:

1 **అవలోకనం**
–ప్రఖ్యాత రచయితల అపూర్వ వ్యాఖ్యానాల సంకలనం.

2 **గ్లోబల్ సందర్భంలో నగ్నముని కొయ్యగుర్రం**
–గ్రంథరచయిత : శ్రీ కల్లూరి భాస్కరం

3 **కొయ్యగుర్రం దార్శనికత :**
–ప్రముఖ రచయితల మరికొన్ని కొత్త కోణాలు ఆవిష్కరించే వ్యాఖ్యానాల సంకలనం



## అంకితం

ఈ వ్యవస్థ హృదయంగల హయమనీ వేగంగా కూడూ గూడూ గుడ్డా దొరికే సోషలిస్టు హయాంలోకి తమని తీసికెడుతుందనీ అమాయకంగా నమ్మి ఈ కొయ్యగుఱ్ఱాన్ని కొలుస్తూ దీని రాజకీయపు ఇనపడెక్కల కింద నలుగుతూ బానిసలుగా బతుకుతూ 1977 నవంబరు 19న సాగరమెత్తిన జలఖడ్గం కింద ఊపిరి తెగిన అసంఖ్యాక అమాయక అభాగ్యులకి –



# కొయ్యగుర్రం

# 1

జీవితం మిథ్య అనడం అబద్ధం
ఎంగిలిమెతుకులేరుకుని ఎలక్ట్రిక్ తీగల మీదా
ఇళ్ళ కప్పుల మీదా జంతు కళేబరాల మీదా
'అలగాజనం' పుళ్ళ మీదా పొడుచుకు తినడానికి చేరే
కాకులు మాత్రమే
మిథ్యగూర్చి కావుకావుమంటూ ప్రవచించగలవు

మానవత్వం బతికి వుందనడం అబద్ధం
కప్పుకోడానికి మేక చర్మాల కోసం తిరిగే
మెకాలు మాత్రమే నీతి వాక్యాలు వేదికల నుంచి
ఉపన్యసించగలవు

విశ్వశ్రేయం కావ్యం అని అరుస్తూ
ప్రబంధ నాయకి తొడల బంధనాల్లో
పాదాలకు పూసుకుని ఎగిరే లేపనాల్లో
అంటుకున్న కవిత్వం అబద్ధం

తపస్సు చెయ్యడానికి వెళ్ళవలసింది
హిమాలయాల్లోకి కాదు
జనంలోకి

పరిత్యజించవలసింది సంసారబంధం కాదు
స్వార్థాన్ని

ఓంకారం కాదు
ఆర్తనాదమే జీవికి అన్ని భాషల్లోనూ మిగిలే
అనివార్య అంతిమ శబ్దం

జీవితం సాంకేతికమై జ్ఞాననేత్రం తెరుస్తుందనడం
అబద్ధం

మనిషి శతాబ్దాలు గడిచేకొద్దీ నాగరీకుడవుతాడనడం
అబద్ధం

ఈ భూమిపై నిరంతరం జీవన ఘోషతో
రోడ్ల పక్కనపడి మూలుగుతూ దొర్లుతున్న
కొన వూపిరి నిజం
మృత్యువు నిజం

మౌనాన్ని మిగిల్చి వెళిపోయిన శవం నిజం
దరిద్రం నిజం
దరిద్రం చిమ్మే చీకటి నిజం
సమస్త లోకాన్ని బతికించే సంపద సృష్టించేవాడి రక్తం
విలువలేని ఖనిజం

జీవితం నాగలై
చర్మాన్ని దున్ని ముడతల చాళ్ళతో నింపుతుంది
అనుభవాల పంట బంగారం పండుతుంది
పండించిన వాడి నోటిలో మొలిచేది మాత్రం జిల్లేడు
కళ్ళలో కదిలేవి వెలుగు కిరణాలు కాదు
కన్నీళ్ళు

అంతరిక్ష నౌక
చంద్రమండలం వేపు దూసుకువెడుతుంది
దానిలోనే పొంచున్న ఓ దోమ శాస్త్రవిజ్ఞాన ప్రగతిని
పరిహసిస్తూ వ్యోమగానం చేస్తుంది

# 2

కవిత్వం కాగితాలపై అక్షరాల్ని ఖననం చేసే
కాటికాపరి

కవి నుండి బయటపడ్డ ప్రతి అక్షరం
భావాన్ని భ్రూణహత్య చేసిమరీ
బయటపడుతుంది
కవిని హంతకుడిగా చిత్రిస్తుంది

అక్షరాల్ని నిత్యం శంకించి ఉపయోగించే వాడే
నిజమైన కవి

మనిషిలోని అన్ని అంగాలూ
జంతువులుగా మారడానికే
జీవితాంతం ప్రయత్నిస్తాయి

ప్రకృతిలోని అన్ని గ్రహాలూ
భూమిని ప్రభావితం చెయ్యడానికే
గిరగిరా తిరుగుతాయి

చివరకు మిగిలేది
గాయంగాని రక్తంమరకగాని కనబడని
హత్య మాత్రమే

# 3

నేను బహుశా ఒకే పాట పాడుతున్నాను
నేను జీవితాంతం ఒకే పాట పాడతాను
నా పొట్టలోంచి ఒక పేగును బయటికి పీకి
ఏక్ తారాగా వాయిస్తూ వీధి వీధినా
పాడుకుంటూ పోతాను

నిజాన్ని వినగల చెవి కోసం
లోకమంతా
గాలిమీద గాలిస్తాను

# 4

పొద్దు తనను పొడవక ముందే
బక్క టెద్దులు వెంటరాగా

నాగలి బుజాన వేసుకొని

పొలం వెళ్ళే ప్రతి రైతూ నాకు

శిలువ మోస్తున్న జీసస్‌లా కనిపిస్తాడు

అవును

నేను హత్య గురించి మాట్లాడుతున్నాను

చివరి విందులో

చివరికి తననెవరు మోసం చేస్తారో

జీసస్‌కి తెలుసు

హంతకులెవరో నాకు తెలుసు

నెపం కాసేపు సముద్రం మీదకి తోస్తాను

కేలండర్‌కి రక్తమాంసాలుండవు

కేవలం కాలం కుక్కనోటిలోని ఎముకముక్క

గోడకు బల్లిలా కరుచుకుపోయిన వృత్తి

కాగితం ముక్క

తారీకులు ముద్దాయిల్లా బోనుల్లో నిలుచునుంటాయి

అది ఏ తారీకన్నా కావొచ్చు

అది నవంబర్ 19 కావడం యాదృచ్ఛికం కావొచ్చు

ప్రళయాలూ పరిహాసాలూ తప్ప కేలండర్‌లో

కన్నీటి గుర్తులుండవు

వారాలు రోగుల్లా ముసుగుదన్ని పడుకునుంటాయి

ముసుగు కప్పిన మూలుగులపై వెల్లవేసే తెల్లకాగితం
కాలాన్ని దినాలుగా వారాలుగా ముక్కలు చేస్తే
కారుతున్న తెల్లటిరక్తం
తెల్లని రక్తం వెనక ముసుగు తీసి మూలుగు వినగలిగితే
అది ఏ దినమన్నా కావొచ్చు ఏ వారమన్నా కావొచ్చు
కాలనేత్రం మాత్రం శనివారం గాలానికి తగిలి
తన్నుకుంటూ ఆగిపోయింది

ప్రకృతిలోగాని వికృతిలోగాని
దానవత్వపు అంధకారమే నిరంతరం
మనుషుల్ని పాలించే నిజం

మానవత్వం మాత్రం
ప్రతిరోజూ ప్రతిక్షణం పుట్టి చచ్చే
వెలుగు కిరణం

# 5

జెనీవాలో శాంతి మహాసభలు జరుగుతాయి
దేవాలయాల్లో అర్చనలు జరుగుతాయి
సత్రాల్లో అన్నదానాలు జరుగుతాయి

మసీదుల్లో ప్రార్థనలు జరుగుతాయి
దెయ్యాలు అన్ని భాషల్లోని వేదాలూ
రకరకాల గొంతుల్తో వల్లిస్తాయి

ఎగరేసిన పావురం చివరికి పిల్లి నోటికే చిక్కుతుంది
అర్చనలూ అన్నదానాలూ చూసి
ఆకలి పగలబడి నవ్వుతుంది

ఆకలి తిరగబడితే అదుపులో పెట్టడమెలాగో
ఆకలి తీరిన వాడికి తెలుసు
గురి పేల్చే గుండు ఏ గుండెను చీల్చనుందో
ట్రిగర్ నొక్కే వేలికి తెలుసు
హంతకులెవరో నాకు తెలుసు
కవిగా మోసగాడిగా నెపం కాసేపు
కాలం మీదకి నెట్టేస్తాను

బట్టలేసుకుని నగ్నత్వంలోకి పారిపోతుంది
నాగరికత
కేబరేలో తాదాత్మ్యం పొందే కళ్ళలో దాక్కోడానికి
ప్రయత్నిస్తుంది
అక్కడా ఆకలే
అనంత రూపాల్లో ఆకలి
బతికున్నంతకాలం మనిషిని వేటాడుతుంది
బతుకునిండా కలుగులే

బతకడం మాని అంతా పారిపోవడమే
ప్రపంచమంతా ఎక్కడికో ఏ యదార్థం నుంచో
పారిపోతోంది ఒగురుస్తూ పారిపోతోంది
కత్తితో మృత్యుహస్తం వెంటాడుతున్నట్లు
పారిపోతోంది

మనిషి ఊపిరి కొయ్యడానికి
కత్తే కానక్కర్లేదు
జీవితాల్ని చెరచడానికి
మరుక్షణం మృతకళేబరం చెయ్యడానికి
తుపాకులూ యుద్ధాలే రానక్కర్లేదు
నూరేళ్ళు నవ్వుతూ తుళ్ళుతూ వేయిరేకలతో
వెలుగులు వెదజల్లుతూ పుష్పించవలసిన బతుకుల్ని
భగ్గున మండించెయ్యడానికి పెట్రోలే అక్కర్లేదు
ఉప్పు నీళ్ళు చాలు

దాహం తీర్చి ప్రాణం నిలబెట్టవలసిన నీరే
గొంతు పిసగ్గలదు

మానవ దౌష్ట్యానికీ ప్రకృతి ప్రళయానికీ
విరిగిపోయేవి దరిద్రుల ఎముకలే
చివరికి మిగిలేవి గుడిశెల మృతకళేబరాలే

హెలికాప్టర్లోంచి చూసినా విమానంలోంచి చూసినా
కార్లలో టోపీల్లో పత్రికా ప్రకటనల్లో దాక్కుని
తొంగి చూసినా
దగ్గరకు వెళ్ళి కదిపి చూసినా
దగా దుర్మార్గం దాచుకుని
దయా ప్రేమ అభయ ముద్రతో చూసినా
ఒకటే దృశ్యం
ఒకటే పొర్లుతున్న మౌనశోకం
అయినా ఫర్వాలేదు
శవం
సంజాయిషీ కోరదు

చివరి విందులో
చివరికి తననెవరు మోసం జేస్తారో
జీసస్‌కి తెలుసు
హంతకులెవరో నాకు తెలుసు
నెపం కాసేపు ప్రకృతి మీదకి తోసేస్తాను

ఒకప్పుడు ఇక్కడో ఊరు ఉండేది
ఒకప్పుడు ఇక్కడి గాలి నిండా నేల నిండా
ఆకాశం నిండా మనుషుల పాటలు మాటలు
ఊర్పులు ఓదార్పులు నవ్వులు నిట్టూర్పులు
కలకలం కలగానం కనబడేది వినబడేది

చెట్ల ఆకులు పచ్చగా గాలిలో ఈదేవి
పక్షుల బారులు కొంటెగా పళ్ళు కొరికి
గుసగుసలు పోయేవి

ఒకప్పుడు ఇక్కడ బంగారం బరువుకి ఒంగి
పొలాలు హొయలు హొయలుగా నృత్యం చేసేవి

కాలానికి సిగ్గులేదు చరిత్రకు సిగ్గులేదు
సృష్టికి సిగ్గులేదు

బలహీనుడు సంపద సృష్టిస్తాడు
బలవంతుడు సంపద మింగి దరిద్రం పంచుతాడు
చరిత్ర నిండా దరిద్రుల శవాల గుట్టలే

# 6

అర్ధరాత్రి
అంతఃపురం వొదిలి తల్లిదండ్రుల్ని వొదిలి
పెళ్ళాం బిడ్డల మధ్యగా పెనవేసుకున్న
పేగు తెగ్గోసుకుని
సకల సంపదల్నీ పరిత్యజించిన సిద్దార్థుణ్ణి
రాజ్యం పొలిమేరవరకూ చేరవేసి తిరిగొచ్చిన

అశ్వం
అశ్రునయనాల్తో నాగార్జున కొండలో ఇంకా
నిలబడే వుంది
మానవుడి మనసులో మాత్రం
మహాబోధి ఎప్పుడో కూలిపోయింది

# 7

అశ్వం
వేగానికి విశ్వాసానికి చిహ్నం
విజయానికీ పరిపాలనా దార్ఢ్యానికీ సంకేతం

కొయ్యగుర్రం
స్తబ్దతకీ మూర్ఖతకీ
అజ్ఞానానికీ అహంకారానికీ
అసమర్థ పరిపాలనకీ ప్రతీక

అశ్వ హృదయం
అశ్రునయనాల్తో నిలబడే వుంది
కొయ్యగుర్రం మాత్రం
పూటా రూపాయి మోతతో

భీకరంగా సకిలిస్తోంది
కొయ్యగుఱ్ఱం భూమ్మీద నడవదు
ఇనప నాడాల్తో చెక్క హృదయంతో ధనమదంతో
'అలగాజనం' బుజాల మీద స్వారీ చేస్తుంది
బరువుకి కుంగిపోతూ తలలెత్తితే
భీషణంగా సకిలించి అణగదొక్కుతుంది
కొయ్యగుఱ్ఱమెక్కి కొయ్యకత్తితో
ఊరేగే ప్రభుత్వాలు
దేవాలయాల మీది బూతుబొమ్మలు

# 8

చివరి విందులో
చివరికి తననెవరు మోసం జేస్తారో
జీసస్‌కి తెలుసు

తీరమంతటా గుడిశె వుందని తెలుసు
గుడిశె ముందు పుట్టలున్నాయని తెలుసు
పుట్టల్లో కోడె నాగులున్నాయని తెలుసు
పడగల్లో విషముందని తెలుసు

పాలుపోసే చేతినే అదను చూసి పడగకెరటాల కోరలు
కాటేస్తాయని తెలుసు
హంతకులెవరో నాకు తెలుసు
అయినా నెపం కాసేపు సముద్రం మీదకి తోసేస్తాను

నిద్రపోతే కలలు కళ్ళని కుడతాయి
కదిపితే తేనెటీగలు ఒంటిని వెంటాడి మరీ కుడతాయి
కదపకపోయినా నోరు మెదపకపోయినా
క్షుద్రరాజకీయాలు
నిండు జీవితాల్ని కుడతాయి
మనిషిని మనిషి చేసే మోసం కాలానికి తెలుసు
కారణాలు కార్ల్‌మార్క్స్‌కి తెలుసు

రోడిన్
మ్యూజియంలో శిల్పంగా మారి
గడ్డానికి చేతిని ఆన్చి
ఆలోచిస్తూనే ఉంటాడు

ఆలోచనకీ మనిషికీ వున్న సంబంధం ఏమిటి
భాషకీ భావానికీ వున్న సంబంధం ఏమిటి
వేదనకీ శరీరానికీ వున్న సంబంధం ఏమిటి
నేలకీ నీటికీ వున్న సంబంధం ఏమిటి

# 9

అంతవరకీ

ప్రపంచంలోని అర్ధరాత్రుల గదుల్లోని

భాష  అంతా ఒకటే

రెండు శరీరాలు ఏకమయ్యే సమయం

గడియారంలోని ముళ్ళు రెండూ ఒకటి కావడానికి

తహతహలాడిపోయే సమయం

కొత్త కొత్త కలలు చర్మంలో ప్రాణం పోసుకునే సమయం

వసంతం దిగివచ్చి శరీరాల మీంచి

పక్షిలా పాడుతూ రెక్కలతో విసురుతూ

యవ్వన పరిమళాలతో

ఎగురుతూ ఎగిసిపడే సమయం

అప్పటికప్పుడు మొక్కలు చెట్లయి మొగ్గలు వేసి

క్షణంలో సగంలో పుష్పించి ఫలించి కాలానికి కొత్త

అర్థమిచ్చే సమయం

చెట్టుమీది పువ్వుతుంపి సిగలో తురిమి

ఆదుకుని అదుముకుని అల్లుకుపోయే సమయం

ఆకాశవృక్షాన్ని కుదిపి రాలిన నక్షత్రాల కాంతిని

కళ్ళలో ఒంపుకుని నిట్టూర్పుల సెగలకి కనబడని
వినబడని ఊదొత్తులు మౌనంగా వెలిగి నీలి పొగల
పాటలు పాడే సమయం

ఇది గది కథ కావొచ్చు ఇది గుడిశె గాథ కావొచ్చు
ఇది పేవ్‌మెంటు వ్యథ కావొచ్చు
పురుషుడు స్త్రీని హృదయానికి హత్తుకుంటాడు
శిశువు మాతృస్థన్యం కోసం వెతుక్కుంటుంది
కాదుకాదు ఇది నిజం కాదు

ఆ క్షణం
ఆవేదనే నిజం
ఆర్తనాదమే నిజం

కొయ్యగుర్రానికి నిజం తెలుసు
అయినా చెప్పదు
కడలి కెరటానికి నిజం తెలుసు
కెరటాలపై కనబడని రక్తపు మరకలకి నిజం తెలుసు

నదుల మంచినీళ్ళని కౌగిలిలోకి లాక్కుని
తనివితీరా తాగితాగి తెగబలిసిన కొండచిలువలా
మెలికలు తిరిగి
కాలంపై భూగోళంపై 'అలగాజనం' ముఖాలపై
వృక్షాలపై పక్షులపై సమస్త జంతుజాలంపై
చీకటి ముసుగు హఠాత్తుగా కప్పి

నీటితో పేనిన తాళ్ళతో గొంతులు బిగించి
కెరటాల్లో కాటేసి వికటాట్టహాసంతో
బుసలు కొడుతూ పరవళ్ళు తొక్కింది
మనిషి బతికుండగా దాహం తీర్చలేని
ఉప్పునీటి సముద్రం
మిగిలింది కెరటాలు కాదు
శవాల గుట్టలు
శరీరాల్నుండి తెగిపోయి గాలికి ఊగుతున్న
ఊపిరి దారాలు

హఠాత్తుగా ఉన్మాదిలా ఉవ్వెత్తున లేచిన
లక్షల కెరటాల పడగల బుసలకి
కోడిగుడ్డులా పగిలి సొనకారి చితికిపోయిన
సూర్యుడికవతల
కారుమబ్బుల ఘీంకారపు మెరుపు కార్చిచ్చులో
మాడిమసైన చంద్రుడికవతల
నేల నాలుగుచెరగులా రోడ్ల పక్క పెంటకుప్పల పక్క
కుక్కలూ పందులూ మానవాస్థి పంజరాలు
పొట్లాడి కాట్లాడి చింపిన విస్తరిలాంటి ఆకాశంలో
చిందరవందరైన మెతుకుల్లాంటి నక్షత్రాలకవతల
లోకమంతా అరణ్యంలా అల్లుకున్న మత గ్రంథాల
సూక్తులకవతల ప్రార్థనలకవతల
ద్రోహ ఘోష కవతల

విద్రోహి వికటాట్టహాసానికవతల
పెను హత్యకవతల
జీవితాన్ని మించిన నిశ్శబ్దం
వెలుతుర్ని మించిన నిశ్శబ్దం
శబ్దాన్ని మించిన నిశ్శబ్దం
వేగాన్ని మించిన నిశ్శబ్దం
విశ్వాన్ని ఆక్రమించి
శవం కన్నుల్లో నిలిచిపోయిన
నిశ్శబ్దం

# 10

సముద్రం, గుర్తుందా నీకు
చిన్నప్పుడు
తెల్లటి నురగల్తో బొచ్చుకుక్కపిల్లలా
నువ్వు నా కాళ్లచుట్టూ
చుట్టేసుకుంటూ తిరిగినప్పుడు
అలల నాలికల్తో నా పాదాల్ని నాకినప్పుడు
నిన్ను అమాయకపు ప్రాణివనుకున్నాను
నిన్ను పెంచుకుందామనుకున్నాను

నీ ఘోష మాన్పి లాలిద్దామనుకున్నాను
అవును
నేను సముద్రాన్ని సముదాయిద్దామనుకున్నాను
కాని
కెరటాలక్కూడా కోరలుంటాయని కనుక్కోలేకపోయాను
గాలి రెక్కలక్కూడా కత్తులుంటాయని
కానుకో లేకపోయాను
కన్నీళ్లలోకి కూడా రాజకీయాలు ప్రవహించగలవని
తెలుసుకోలేకపోయాను
ఆ క్షణం
పెనుకడలి క్షణం
సూర్యుడూ చంద్రుడూ బొగ్గుముక్కలుగా
మారిన క్షణం

అంతా నాశనం
నేలనీ ఆకాశాన్నీ నమ్మి బతికిన సమస్త ప్రాణికోటి
మృతకళేబరంగా మారిన క్షణం

చచ్చిన వాడికి చిరునామా వున్నా లేకున్నా
ఫరవాలేదు
పొట్టచేత పట్టుకుని గుప్పెడు మెతుకుల కోసం
ఊరూరా తిరిగేవాళ్ళు ఎంతమంది చచ్చినా
ఫరవాలేదు

వందేళ్ళు నీడనిచ్చిన వటవృక్షం ఫెళఫెళా విరిగిపడినా
పిట్టలు గాలి తాకిడికి రాలిపడినా
ఎలక్ట్రిక్ స్థంభాలు మొక్కల్లా వొంగిపోయినా
లోకంలోని ఆర్తనాదమంతా
చీకట్లో తృటిలో నీటి ఇనుపకౌగిట్లో అల్లల్లాడి
ఏ మృత్యుహాస దీవులకు చేరిందో
కనుపాపలు టపటపా పక్షుల రెక్కలకిమల్లే
కొట్టుకుని చేతులు గొంతుకోస్తున్న
గాలి బాకుల్ని ఆపబోయి పెనుగులాడి
ముక్కలుముక్కలయిపోయి
మరణం ముందు పక్షీ జంతువూ మనిషీ
సమస్తం సమానంగా తలవొంచి నిలుచున్నాయి
అన్ని కళేబరాలూ

బతుకుల్ని నిలబెడతామని బుజాలెక్కి కూచున్న వాళ్ల
అలక్ష్యానికీ అహంకారానికీ సాక్ష్యాలుగా
మిగిలిపోయాయి
అయినా మరేం ఫర్వాలేదు
కంకాళం సంజాయిషీ కోరదు

# 11

ఇప్పుడు ఎవరయినా ఎవర్నయినా
కొత్తగా చంపేదేమిటి

ఏ క్షణంలో దేవుడు పుట్టాడో
ఏ క్షణంలో విధిరాత నుదుటిపై
లిఖించబడిందన్నారో
ఆ క్షణమే మనిషి చచ్చాడు
కర్తవ్యం చచ్చింది
ఇప్పుడు కొత్తగా ఎవరయినా ఎవర్నయినా
చంపేదేమిటి
ఇప్పుడు కొత్తగా సముద్రం చంపేదేమిటి
ఇప్పుడు కొత్తగా కొయ్యగుర్రం చంపేదేమిటి

మరేం ఫర్వాలేదు
ప్రజాసేవ చెయ్యడానికి కావలసినంతమంది
పోటాపోటీలుపడే నాయకులున్నారు
శవాల్ని ఖాళీ చెయ్యడానికి
కాకులూ గద్దలూ రాబందులూ
లేకపోయినా ఫర్వాలేదు

కాంట్రాక్టర్లున్నారు
జాతికి సేవ చేస్తారు

మరేం ఫర్వాలేదు
అనాథప్రేతం సంజాయిషీ కోరదు

జీవితాంతం పదవిని ఒంటినిండా బట్టగా
చుట్టుకున్న వాళ్ళు మరణిస్తే
వినయంతో విషాదంగా తలదించుకుంటుంది
దేశమ్మీద ఎగిరే జెండా
దిక్కులేని జనం వేనకువేలు దిసమొలల్తో
జీవితాంతం దుమ్ములో బతికి
కళ్ళముందే క్షణంలో దుమ్ములో కలిసిపోతే
జెండా కన్నీరు కార్చదు
మరింత గర్వంగా గాలిని సవాలు చేస్తూ
ఆకాశాన్ని రెపరెపల్తో పరిహసిస్తూ
ఠీవిగా ఎగురుతుంది
గాలిలో నాదస్వరం వినదించదు
కాలం గొంతు జీరవోదు
చరిత్ర నయనం చెమ్మగిలదు

కొంతసుఖం
బతికి వున్న వాడు నిజం చెప్పడు
శవం మాట్లాడలేదు
కొంత సంతోషం

చనిపోగానే మనిషితోపాటు
భాష కూడా చనిపోతుంది
ప్రపంచం చనిపోతుంది
దేవుడు కూడా చనిపోతాడు

ఎప్పుడో ఒకప్పుడు
ఈ బీళ్ళు సాగుచేస్తున్నప్పుడు
హఠాత్తుగా ఒక పుర్రె బయటపడి
పకాలున నవ్వుతుంది

మరేం భయం లేదు
కంకాళం సంజాయిషీ కోరదు

ఈ వ్యవస్థలో
పుట్టడం మోసపోవడానికే
పెరగడం మోసపోవడానికే
ప్రేమించడం మోసపోవడానికే
నమ్మడం మోసపోవడానికే

జీవితం చివర్న పొంచున్నది మాత్రమే
మృత్యువు కాదు
అజ్ఞానంలోనూ మూర్ఖత్వంలోనూ
బతుకు భయంలోనూ ద్వంద్వ జీవితంలోనూ
నయవంచనలోనూ ప్రతిక్షణం వెంటాడేది
మృత్యువే

మృత్యువును జయించడానికి
అంతులేని సాంకేతిక విజ్ఞానం

రోడ్లపక్క ప్లాస్టిక్ చెట్లు నాటుదాం
ప్లాస్టిక్ కొమ్మలపై ప్లాస్టిక్ పక్షుల్ని కూచోబెడదాం
ప్లాస్టిక్ కంకులు నాటి
పొలాలు బంగారం పండినట్లు చూపుదాం
జనం ఆనందంగా ఆడుకుంటూ పాడుకుంటూ
జీవిస్తున్నట్లు మరబొమ్మలు చేయించి కీ యిచ్చి
ఇసక పర్రల్లో వొదులుదాం
ప్లాస్టిక్ ఆవుల ప్లాస్టిక్ గేదెల ప్లాస్టిక్ పొదుగులు
పితుక్కుని ప్లాస్టిక్ పాలు తాగుదాం
కొయ్యగుర్రాన్ని ఒహోం ఒహోం అంటూ
జీవితాంతం మెడలమీద మోద్దాం

## 12

చివరి విందులో
చివరికి తననెవరు మోసం చేస్తారో
జీసస్‌కి తెలుసు
హంతకులెవరో నాకు తెలుసు

నెపం నా మీదనే వేసుకుంటాను

నాకు రాకెట్లువొద్దు చంద్రమండలం వొద్దు
విమానయానాలొద్దు
కాలాన్నీ జీవితాన్నీ కలుషితం జేసే
రాజకీయ కార్యకలాపాలొద్దు
రైళ్ళొద్దు బస్సులొద్దు యీ నాగరికత రద్దీ ఒద్దు

పాత రాతియుగం పనిముట్టు పట్టుకుని
చరిత్ర చీకటి కోణాల గుహల్లోకి
వెళ్ళిపోతాను
ఈ శవాల్ని ఈ సమస్త జంతుజాలం కళేబరాల్ని
నా లోనే ఖననం చేస్తాను
కొయ్యగుర్రాన్ని తగలబెట్టగల
ఇంధనం కనిపెడతాను

కొత్త కలల్తో
కొత్త విలువల్తో
కొత్త విశ్వాసాల్తో
విశ్వ వస్త్రం నేసి
తిరిగొచ్చి
దిసమొలగా దిక్కుల మధ్య దిక్కులేకుండా
పడి వున్న మనిషి ఒంటిపై కప్పుతాను



# The Poetic Vision of Nagnamuni

నగ్నముని కవిత్వం తాజా పాలవలె ఇంపైనది కాదు. డాక్టరు ప్రిస్క్రైబ్ చేసిన మందువలె చేదుగా అప్పుడప్పుడు వుంటుంది. అతని కవితలు పాఠకులను ముద్దు చేస్తున్నవి కావు. లాలిస్తున్నవి కావు, అప్పుడప్పుడు బుగ్గలపై చరుపులు వేస్తున్నవి. అయితే, అతను రాసిన ఒక ముక్క ఒకసారి చదివితే మీరు దాన్ని మరచిపోలేరు. అది జ్ఞాపకంలోకి వచ్చి అక్కడ ఎన్నటికీ నిలిచి వుంటుంది.

నగ్నమునిగా సాహిత్యరంగంలోకి దాదాపు పదేహేనేళ్ళ కిందట ఇతర దిగంబర కవులతో ప్రవేశించారు. వాళ్ళ కవిత్వంలో స్వాభావికంగా అంతర్భూతమైన గుణాపగుణాలు, పూర్వకాలపు సాంస్కృతిక పరంపర యొక్క సంపూర్ణమైన నిరాకరణ "వామపక్షత్వం అనే బాలారిష్టం" మొదలైనవి – అతని రచనల్లోనూ అప్పుడప్పుడు ప్రవేశించాయి. అప్పటి నుంచి మన కవి సృష్టి ప్రజ్ఞకు కాలగతితో కొంతవృద్ధి పొందింది. తన యౌవనకాలపు ఆదర్శములలోను సిద్ధాంతాలలోను ఆవశ్యమైన వాటిని పాటిస్తూ, ఉపేక్షమైన వాటిని తోసివేసి తాను ఎంచుకున్న తోవను సాగిస్తున్నాడు నగ్నముని.

ప్రతి కవికీ సహజంగా ఉండాల్సిన గుణాలలో అతి ముఖ్యమైనది ఒకటి – "కవిత్వాత్మకమైన దృష్టి (Poetic Vision) మనలను చుట్టుకున్న ప్రపంచంలో సాధారణ మానవుడు చూడని, చూడలేని వస్తువులను, లక్షణాలను, వాటికి వున్న సంబంధాలను కవి యొక్క సూక్ష్మ దృష్టి కనుగొనగలదు, కనుగొనక తప్పదు. ఈ గుణము "నగ్నముని" అనే కవికి సంపూర్ణంగా ఉంది. నిజమైన కవుల వలె, నగ్నముని తన రచనల్లో బాహ్య ప్రపంచాన్ని ప్రతిబింబిస్తూ, తన స్వంత ప్రంపంచం సృష్టిస్తున్నాడు. ఈ ప్రపంచంపైపైని చూపులో ఎంతో సంక్షుభితమైనదిగాను, సంకీర్ణమైనదిగాను కనిపిస్తుంది. కాని, సావధానంగా చూస్తే ప్రపంచంలో ఏదో వెలుగు ప్రజ్వలిస్తున్నట్లు కనిపించడం

మొదలవుతుంది. ఈ వెలుగు - అంధకారంలో ఈ సూర్యకిరణం ఏమంటే - సామాన్య మానవుని పట్ల కవి హృదయంలో ఉన్న ప్రేమ, వాటి దుఃఖ విచారాల పట్ల అతని ప్రామాణికమైన సానుభూతి. వీటన్నిటికీ చక్కని నిదర్శనం - నగ్నముని రచించిన "కొయ్యగుర్రం".

హైదరాబాద్ - 1978

లెనిన్ గ్రాడ్ - 1979 నికీతా గూరోవ్

(శ్రీ నికీతా గూరోవ్ రష్యా నుండి తెలుగులో స్వయంగా రాసి పంపిన వాక్యాలు యివి)



# కొయ్యగుర్రం-ఆధునిక మహాకావ్యం

సుమారుగా 1950-60 మధ్య కాలంలో తెలుగు దేశంలో ఆధునిక భావచైతన్యాన్ని ప్రతిబింబించిన ఒకే ఒక్క వారపత్రిక 'తెలుగు స్వతంత్ర' - 1954కు పూర్వం మద్రాసు నుంచి, ఆ తరువాత హైదరాబాదు నుంచి వచ్చేది. ఆ పత్రికకు ఒక అలవాటుండేది. వచ్చిన కవితల్లో ఒక పేజీలో సరిపోయే వాటిల్లో మంచిది ఎన్నుకుని విషయ సూచిక పక్క పేజీలో అచ్చేసేవారు. ఆ పత్రికలో పడ్డ కవితకి, మరీ ముఖ్యంగా, ఆ పేజీలో పడ్డదానికి తెలుగు పాఠక లోకంలో మంచి గుర్తింపు వుండేది. నిజాం కాలేజీలో బి.ఏ. చదువుతుండే కొంతమంది మిత్రులం 1956-58 మధ్యకాలం స్వతంత్రలో కవిత్వం చదువుతూ వాటి మంచి చెడ్డల గురించి హాస్టళ్ళలో, వీధుల్లో, పార్కుల్లో, ఇరానీ హోటళ్ళలో టీ తాగుతూ చర్చించుకుంటుండే వాళ్ళం. ఆత్మవిమర్శలు, పరవిమర్శలు, కావ్య విమర్శల్తో గంటల తరబడి పగళ్ళూ, రాత్రుళ్ళూ గడుస్తుండేవి. అట్లాంటి గంటల్లో ఒకచోట-బహుశా 1957లోనో 1958లోనో అనుకుంటా - ఒక వారం 'స్వతంత్ర'లో విషయ సూచిక పక్క పేజీలో అచ్చయిన "సౌందర్యపు స్వగతం" అనే ఖండికను గురించి చర్చించుకుంటున్నాం. కవి పేరు 'సుధ' అని కొటేషనులో వుంది. ఆ రోజుల్లోనే నేను 'స్వతంత్ర'లో రాస్తున్న నియోభావ గీతాలను అంతగా మెచ్చుకోని మా 'బక్కోడు' (జె.లక్ష్మీనారాయణ అనే స్నేహితుడు) 'సౌందర్యపు స్వగతా' నికి ఇంప్రెస్ అయ్యాడు. 'సుధ' గొంతులో విశిష్టతను గుర్తు పట్టాం. తర్వాత ఎక్కడో కలిశాడీ కవి. అతని పేరు కేశవరావు అని తెలిసింది. 'ఫరవాలేదు పైకొస్తావు' అని బుజం తట్టినట్టు కూడా గుర్తు. కేశవరావు మరో అయిదుగుర్తో కలిసి దిగంబర కవితోద్యమం ప్రారంభించినప్పుడు 'నగ్నముని'గా మారాడు.

దిగంబరోద్యమం ఒక చారిత్రక అవసరంగా వొచ్చింది. ఒక ఉద్యమంగా అది నిర్వహించవలసిన కర్తవ్యం నిర్వహించింది. ఆంధ్ర కవిత్వం చరిత్రలో అతి కొద్దికాలంలో (సుమారు అయిదేళ్ళు) సాహిత్యం మీద అంతగాఢముద్ర వేసిన కవితోద్యమం యింకొకటి కనబడదు. కాలెండరు కవిత్వాలూ, ప్రాజెక్టుల

కవిత్వాలూ రాసుకునే కవులనూ, రాజకీయోద్యమం బలంగా లేకపోవటం వల్ల నిద్రపోతున్న 'అభ్యుదయ' కవులనూ, వాక్య చమత్కారాలతో వచన గీతాలతో ప్రభుత్వ కవి సమ్మేళనాల్లో, ఆలిండియా రేడియోలో చెవులు హోరెత్తించే కవులనూ, కొంత శృంగారం, మరికొంత అభ్యుదయం కలిపి కాసేపు గేయాలు కాసేపు వచన కవిత్వం రాసి పత్రికల్లో పుంఖాను పుంఖంగా అచ్చేసే కవులనూ, ఏం చెబుతున్నారో తమకే తెలియని అయోమయ కవులనూ కొరడా దెబ్బలవంటి తమ 'దిక్'లతో కొట్టి కాలాన్ని కదిలించింది దిగంబర కవిత్వం. మరుగునపడ్డ సాంఘిక ప్రయోజనం అనే లక్ష్యాన్ని మళ్ళీ ముందుకు తెచ్చింది. ఇది తేలికైన పని కాదు. చెప్పే దాంట్లో వున్న శక్తి వల్లనే ఇది సాధ్యమైంది. వ్యక్తీకరణలో స్వేచ్ఛా ప్రవృత్తికి కూడా ఇది దోహదం చేసింది. ఈ దిగంబర కవితోద్యమంలో అత్యంత ప్రధాన పాత్ర వహించాడు నగ్నముని.

దిగంబర కవిత్వం మీద, అందులో భాగమైన నగ్నముని కవిత్వం మీద నాకు కొన్ని రిజర్వేషన్లు లేకపోలేదు. ప్రత్యేకించి నగ్నముని వ్యక్తీకరణ మార్గం మీద నాకు కొన్ని అభ్యంతరాలున్నయ్. అతని కథల మీద, మరీ ముఖ్యంగా 'విలోమకథల' మీద నగ్నముని ఒప్పుకోలేని అభిప్రాయాలున్నయ్. అయితే, దిగంబర కవిత్వం సాధించిందాన్ని గురించి ఒప్పుకోటానికీ, నగ్నముని కవితాశక్తిని గుర్తించటానికీ ఈ రిజర్వేషన్లు నాకడ్డం రాలేదు.

'సౌందర్యపు స్వగతం' నుంచి 'కొయ్యగుర్రం' వరకు ఎదిగిన కవి సామాన్యుడు కాడని అప్పుడు అనుకున్నాను, ఇప్పుడూ అనుకుంటున్నాను. ఇరవయ్యేళ్ళ కిందటనే కొందరం గుర్తించి ఊహించినట్టుగానే కేశవరావు దశల వారీగా గొప్పకవిగా ఎదిగాడు. ఇతని అసామాన్యత్వం అతని ప్రయోగాలన్నిటిలో కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఈ అసమానత్వానికి పరిణతరూపంగా 'కొయ్యగుర్రా'న్ని గుర్తిస్తున్నాను.

'కొయ్యగుర్రం' 1-1-1978 తారీకుగల 'ప్రజాతంత్ర' వారపత్రికలో మొదట అచ్చయింది. కానీ ఆ సంచిక 1977 డిసెంబరులోనే మార్కెట్లోకి వచ్చింది. అంతకు ముందటి సంచికలో 'తుపాను వ్యవస్థ మీద తెలుగు కవి కన్నెర్ర'- అని సంచికలో రాబోయే కావ్యాన్ని గురించి ప్రకటించారు. ఈ కావ్యాన్ని నగ్నముని ఒకటి రెండు చిన్న సమావేశాల్లో చదివి వినిపించాడని తెలిసింది. కాని నాకు ఆ సభలకు వెళ్ళే అవకాశం కలగలేదు. విన్న వాళ్లు చెప్పారు - చాలా బాగుందని, గొప్పగా వుందని, నగ్నముని గొంతులో ఒక

గాంభీర్యం, ప్రౌఢమాధుర్యం ఉన్నై. అందువల్ల అతను చదువుతుంటే విన్న వాళ్లు ఇంప్రెస్ కావటంలో ఆశ్చర్యం లేదు. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి లాంటి వాళ్ళు పద్యం చదువుతుంటే శ్రోతలు ముగ్ధులయినట్టు, నగ్నముని కవిత్వం చదివే పద్ధతికి సహజంగా ఆకర్షితులవుతారు. కాని నాకా అవకాశం దొరకలేదు. అందుకు విచారించటం లేదు. కారణం – 'ప్రజాతంత్ర' సరాసరి పోస్టులో మా ఇంటికి వచ్చింది. ఏకబిగిని పెద్దగా చదివాను. ఇంట్లో అందరికీ చదివి వినిపించాను. మహాకావ్యం చదివిన అనుభూతి కలిగింది. అందుకే 'కొయ్యగుర్రం' మహాకావ్యం. ఆధునిక మహాకావ్యం. తెలుగు సాహిత్యంలో అభినివేశమూ, అభిరుచీ వున్న రష్యన్ మిత్రుడు నికీతా గూరోవ్, నేనూ ఒక రోజు యూనివర్శిటీ గెస్ట్‌హౌస్‌లో కలిసి చదువుకున్నాం. అదే అనుభూతిని యిద్దరమూ పొందాం. నా 'ప్రజాతంత్ర' కాపీ కావాలని గూరోవ్ తనతో పాటు రష్యా తీసుకెళ్ళాడు. రష్యన్ భాషలోకి అనువదించాలనే కోరిక ప్రకటించాడు. ఇదంతా జరిగిన చాలా రోజుల తరువాత, బహుశా కొన్ని నెలల తరువాత నగ్నముని కనిపించాడు. మనసారా అభినందించాను.

ప్రాచీన మహాకావ్యాలకు కొన్ని లక్షణాలున్నై. రసపోషణాదులు కాక అవసరమైన ఇతి వృత్తం, వర్ణనలు, అలంకారాలు, సర్గ బంధం ఇత్యాదులు చాలా ఉన్నై. వీటన్నిటికీ ప్రయోజనంలో మూలతత్వం ఒకటే. కొద్దిపాటి చమత్కారాలతో గిలిగింతలు పెట్టి అల్పానుభూతి కలిగించటం కాక సీరియస్ భావాలతో మహానుభూతి కలిగించటం మహాకావ్య ప్రయోజనం. ప్రాచీన కవులు ఇందుకు ఇతివృత్తాన్ని ఆలంబనంగా ఎన్నుకున్నారు. కథాగమనంలో వైవిధ్యం ద్వారా కావ్యానుభవాన్ని కలిగించాలి. కాబట్టి సహజంగా కావ్య విస్తీర్ణత పెరుగుతుంది. మహాకావ్యం సహజంగా సైజులో పెద్దది కూడా అవుతుంది.

ఈ శతాబ్దపు కవిత్వంలో ఖండకావ్యాలూ, లఘుకావ్యాలూ, మొదలైనవి చాలా వచ్చినై. ఈ కాలంలో వున్నారు కాబట్టి ఈ కాలపు ఇతివృత్తం తీసుకున్నారు. వ్యక్తీకరణలో, పోలికల్లో కొంత భేదం కూడా ఉంటే ఉండొచ్చు. ప్రాచీన కవిత్వంలో ఒక శాఖగానే ఇవి నిలుస్తయ్. అందువల్ల యివి 'ఈనాటి కావ్యాల' వుతాయే కాని ఆధునిక కావ్యాలు మాత్రం కావు.

ఆధునిక కవిత్వంలో వచ్చిన ఒక ప్రధానమైన మార్పు కథను వదిలెయ్యటం. కథాకావ్యాల్లో ఒక చిక్కుంది. కథా నిర్మాణం కోసం కవిత్వం

కాని విషయాలున్న పద్యాలు రాయాల్సి ఉంటుంది. ఎప్పుడో కలగబోయే కావ్యానుభూతి కోసం కొంత చెత్తను కూడా భరించాల్సి వస్తుంది. అది చెత్త అనిపించకుండా ఉండటం కోసం కవి చమత్కారాన్ని కలిగించే వర్ణనలు చేస్తాడు. కథను వదిలివేస్తే ఈ కసరత్తులు చెయ్యక్కర్లేదు. చక్కని చిక్కని భావాల ద్వారా కవిత్వాన్ని సృష్టించొచ్చు. ఈ ప్రయోజనం దృష్టితోనే ఇంగ్లీషులో Poem అనే దానికి సమానంగా తెలుగు కవిత్వంలో 'కవితా ఖండిక' ప్రవేశించింది. కిందటితరం భావగీతాలు, తరువాత తరం అభ్యుదయ గీతాలు, ఆ తరువాత వాళ్ళ వచన గేయాలు మొదలయినవి ఇట్లాంటివే. వీటిల్లో కథ ఉండదు. భావప్రధానంగా ఉంటై. ఇందుకు పత్రికా ప్రచురణ కూడా కొంత కారణం. పత్రికల్లో వెరైటీ అవసరం కాబట్టి ఒక్కో రచన – మరీ ముఖ్యంగా కవిత్వమైతే ఒకటి రెండు పేజీలకన్నా ఎక్కువ కేటాయించ లేరు, కాకపోతే ఇంకో రెండు పేజీలు, అందువల్ల ఒకే భావాన్ని వ్యక్తం చేసే కథారహిత కావ్య ఖండికలు ఇటీవల ఎక్కువగా వస్తున్నాయ్. చోటును ఇంకా పొదుపు చేస్తూ, ఖండికను యింకా కుదిస్తూ ఇటీవల మినీ కవితలు కూడా వస్తున్నయ్. ఒకే భావాన్ని అత్యంత క్లుప్తంగా కుదించి చెప్పి కవితానుభూతికవసరమైన వాతావరణాన్ని నిర్మించుకునే పనిని పాఠకుడికే వదిలేస్తాయి ఈ మినీ కవితలు.

వ్యక్తీకరణలో ఆధునికత కోసం ఇంగ్లీషు 'ఫ్రీవర్స్' అనే వచన కవితా రూపం తెలుగులో బాగా ప్రచారమయింది.

కొద్దోగొప్పో మాత్రాగేయాలు వస్తున్నా, ఎక్కువగా అచ్చులో వచన కవిత్వమే కనిపిస్తున్నది. కవిత్వంలో 'అర్బేనిటీ' (urbanity)ని సాధించడానికి వచన కవిత్వం కవితా వాహకంగా బాగా పనికొచ్చింది. అయితే ఇందులోనూ కొన్ని కథాకావ్యాలు వచ్చినా వాటిలో ఆధునికత లోపించిందనే చెప్పాలి. సాంప్రదాయికమైన అలంకారాలు, వర్ణనలు, కథ మొదలైనవన్నీ అట్లాగే ఉంచి పద్యం బదులు వచనం వాడితే చాలు ఆధునిక కవిత్వం అవుతుంది అని అనుకునే వాళ్లున్నారు. 'ఆధునికత' అనేది ఎన్నుకున్న వస్తువులోనో, ఛందస్సులోనో ఉంటుందనుకోవటం వల్ల ఈ అపోహ కలుగుతుంది. ఆధునికతకి ఈ రెండూ అవసరమే. కాని అంతమాత్రమే చాలదు. వీటితో పాటు వేదనతో కూడిన ఒక తాత్విక చింతన కావాలి. వ్యక్తీకరణలో చమత్కారాలకి బదులు సీరియస్‌నెస్ ఆధునిక కవిత్వం అవుతుంది. ఛందస్సు లేకుండా రాసిన విచిత్ర వాక్య సముదాయం ఆధునికత కాదు. ఈ దృష్టితో

చూస్తే పత్రికల్లో అచ్చయ్యే వచన కవితా ఖండికలన్నీ 'నేటి కవితలు' అవుతై గాని 'ఆధునిక కవితలు' కావు.

కావ్యఖండికల్లో ఒకే వస్తువు (అంటే కథ కాదు) ఒకే భావం ఉంటై. ఒక ఖండికలో భిన్న భావాలను కలిగించటం కష్టం. దానికి కొంత విస్తీర్ణత కావాలి. మనం రోజూ చూసే ఖండికల కన్నా పెద్దవిగా ఉంటే తప్ప భిన్న భావాలను చెప్పటం కుదరదు. అంటే మహాకావ్యం కావాలి. మహాకావ్యానికి విస్తీర్ణతే ప్రధానం కాదుగాని అవసరమైన ఒక లక్షణం. పెద్ద పాయింటులో అచ్చెయ్యటం వల్లనో, పాదాలుగా విరవటం వల్లనో కవిత్వం కానట్టే, విస్తీర్ణత వల్లే ఏదీ మహాకావ్యం కాలేదు. ఒక ప్రధాన వస్తువుతో ఒక తాత్విక చింతనతో, సందేశంతో, అనేక భావాలతో, moods తో కథ లేకుండా, 'అర్బేనిటీ' అనే లక్షణం కలిగి వుండి, తగినంత విస్తారంగా వున్న దీర్ఘకవితను ఆధునిక మహాకావ్యం అంటున్నాను.

ఈ నిర్వచనంతో కొలిచి చూస్తే 'కొయ్యగుర్ర'మే మొదటి ఆధునిక మహాకావ్యంగా కనిపిస్తున్నది.

కావ్యఖండికల సంపుటులు చాలానే వచ్చినై. భావ, అభ్యుదయ, విప్లవ కవుల ఖండికల సంపుటులు మహాకావ్యాలుగా భ్రమపడగూడదు. వాటిల్లో ఏ ఒక్క సంపుటి తీసుకున్నా ఫిలాసఫీ ఒకటే కావచ్చు. భాషా వైవిధ్యమూ వుండొచ్చు. కాని భిన్న భావాలను కలిపే నిర్మాణ బంధం (structural tie) లేకపోవటం వల్ల అవి ఖండికల సంపుటులే అవుతై కాని మహాకావ్యాలు కావు. ఆ ఖండికలను మొత్తం నుంచి విడదీసి చదివితే విడినవాటికి గాని, మిగిలిన వాటికి గాని నిర్మాణరీత్యా లోపం ఉండదు. అదే వాటి ఖండిత్వానికి గుర్తు. మహాకావ్యం భావరీత్యా ముక్కలుగా కనిపించినా నిర్మాణరీత్యా అఖండం.

ఆధునిక వస్తువుతో, ఆధునిక ఛందస్సుతో – అంటే వచన కవితలో – అఖండమైన కావ్యాలు కొన్ని వచ్చినై. వాటిల్లో వివిధ భావ సమ్మేళనం కూడా ఉంది. వాటిని మహాకావ్యాలు అన్నా అభ్యంతరం చెప్పను. కాని ఆధునిక కావ్యాలు కావు.

నగ్నముని తన కవిత్వమంతా ఫ్రీవర్స్‌లోనే రాస్తాడు. ఫ్రీవర్స్‌లో స్వేచ్ఛ ఎక్కువ. అదే దాని బలం. అయితే ఈ స్వేచ్ఛవల్ల కవికి బాధ్యత కూడా పెరుగుతుంది. ఛందస్సులో రాసే వాళ్ళకి పదాల ఎన్నికలో స్వేచ్ఛ ఉన్నా కవితా రూపంలో స్వేచ్ఛలేదు. అది సిద్ధంగా ఉంటుంది. ప్రసిద్ధంగా ఉన్న

రకరకాల పద్యగేయ భేదాల్లో కవి కొన్నిటిని ఎన్నుకుంటాడు. ఫ్రీవర్స్‌లో కవితా రూపం సిద్ధంగా ఉండదు. కవే తయారు చేసుకోవాలి. ముందుగా తయారు చేసుకోటమంటూ ఉండదు. రచన, రూపరచన ఏకకాలంలో జరుగుతై అందువల్ల కవికి శ్రమ, బాధ్యత ఎక్కువ.

సిద్ధాంతరీత్యా ఛందస్సుల్లో అనంతరీతులుసాధ్యమయినా మౌలికమయిన ఛందోరీతులూ, కవుల వాడుకలో ఉన్న పద్య గేయ భేదాలూ పరిమితమైనవే. వాటిలో ఏవో కొన్నిటిని ఎన్నుకుని రాసే కవికి దారి తప్పే ప్రమాదం ఉండదు. ఫ్రీవర్స్‌లో మాత్రం కవితా రూపాల సంఖ్యకు పరిమితి లేదు. ఎప్పటికప్పుడు కవితా రచన, రూప రచన జమిలిగా చేసుకుంటూ పోవాలి.

ఛందస్సులో కొన్ని రకాల పద్యాల్ని మార్చి వాడుకుంటూ పోతే రూపవైవిధ్యాన్ని సాధించొచ్చు. అంటే రూపవైవిధ్యం కొన్ని నిర్ణీత పద్ధతుల్లోనే ఉంటుంది. ఫ్రీవర్సులో వైవిధ్యం కూడా కవి స్వయంగా కవితా రచనతో పాటే ఆలోచించుకోవాలి. మహాకావ్య రచనలో అదియింకా అవసరం. వైవిధ్యం లేకపోతే ఫ్రీవర్సు మరీ విసుగెత్తిస్తుంది. కేవలం వాక్య భేదాలతో వైవిధ్యం సాధించాలనుకుంటే చిత్రవాక్య రచనతో 'సీరియస్‌నెస్'ని పోగొట్టుకునే ప్రమాదముంది. మహాకావ్య రచనకిది మరీ ప్రమాదం. ఛందస్సుల్లో వాక్య నిర్మాణాన్ని గురించి కవి ఎక్కువ శ్రమ పడక్కర్లేదు. సాధారణ వాక్యాల్నే వాక్య నిర్మాణం అనుమతించే పదక్రమ భేదాలను పద్యగేయ చట్రాలలో ఇమిడించవచ్చు. కాని ఫ్రీవర్సులో వాక్యరచన సాధారణ వచనంలో వాక్యరచన కన్నా భిన్నంగా ఉంటూ పద్యత్వాన్ని రానీయకుండా ఉండాలి. వచనంగా ఉంటూ, పేలవంగా ఉండకూడదు. వాక్యాల మధ్య అంతస్సంబంధాల్ని కల్పించుకుంటూ కవితా రూపాన్ని అల్లుకోవాలి.

ఫ్రీవర్సులో మంచికవిత్వం రాయాలంటే ఈ చిక్కులన్నీ ఉన్నై. అందుకనే ఈ బాధలన్నీ పడలేని వాళ్లు కొన్ని అడ్డదార్లు తొక్కుతుంటారు. తెలుగులో వాక్యం చివరవుండే క్రియను ముందు పెట్టుకోవటం, చేతికి వచ్చినట్టు ముక్కలుగా విరవటం, తమ్ముడూ, నేస్తం వంటి పిచ్చి సంబోధనలు మధ్యమధ్యలో అతకటం, కొన్ని ప్రశ్నార్థక వాక్యాల్ని పదేపదే రిపీట్ చెయ్యటం, పల్లియలు-మల్లియలు అనే విధంగా అంత్యప్రాసలు కలుపుకోటం, గారడీ వాక్యాలు, హాస్యోక్తులు, మధ్యలో తిట్లూ కూర్చటం, సింబాలిజం పేరిట అయోమయపు సంకేతాలు గుప్పించటం - ఇవి ఇటీవల ఫ్రీవర్సు రాస్తున్న

వాళ్ళు చేస్తున్న ట్రిక్కులు. వీటివల్ల కొంత అర్థంకాని అయోమయ కవిత్వం. మరింత సభా రంజనకు పనికొచ్చే విదూషక కవిత్వం మాత్రమే వస్తున్నది. వచన కవిత్వం ఇంతటి అధోగతిలో ఉన్న సమయంలో ఉదాత్తమైన వస్తువుతో, సీరియెస్‌నెస్ ఎక్కడా చెడకుండా 'ఫ్రీవర్సు'నే కవితా వాహకంగా గ్రహించి ఆధునిక మహాకావ్యాన్ని సృష్టించి ఒకేసారి - తెలుగు కవిత్వాన్ని - వచన కవిత్వాన్ని - ఆధునిక కవిత్వాన్ని మళ్లీ పైకెత్తిన నగ్నమునిని మెచ్చుకోకుండా ఉండలేను.

ఇంక - దిగంబర కవుల్లో నలుగురు అప్పటి విప్లవ రచయితల సంఘంలో చేరారు. విరసంలో పాణిగ్రాహి, శివసాగర్ల పాటల బాణీలకు చారిత్రకావసరం దృష్ట్యా ఎక్కువ గౌరవం, ఆదరణ వచ్చినై. ఈ ప్రభావం వల్ల చెరబండరాజు వచన కవిత్వపు కుబుసం వదిలేసి పాటలకవిగా బయటికొచ్చాడు. గద్దర్ పాడే బతుకుపాటలు సామాన్య ప్రజల్లో చైతన్యం కలిగించటమే గాక నాటి ఉద్యమ కవితకు నమూనాలుగా నిల్చి ఉత్తమ కవితాభిమానుల్ని ఆకర్షించి కొత్త కవుల్ని పాటలవైపు లాగేసినై. పాటలు పాటలే కాని 'కవిత' కాదనే అభ్యుదయ కవిత్వపు నాటి దశదాటి, పాటల్లో కూడా మంచి కవిత్వం ఉండవచ్చనే మధ్య దశను కూడా దాటి అసలు పాటల్లో రాస్తేనే ఉత్తమ కవిత్వం అవుతుందనే దశ వచ్చింది. ఇప్పుడు, చెరబండరాజు లాగా మారలేని ఉద్యమ కవులు గద్దర్ తదితర ప్రజాకవుల పాటల శక్తికి తట్టుకోలేక వాటి ఆధిక్యాన్ని ఒప్పేసుకున్నారు. రాయటం కూడా తగ్గించుకున్నారు. అదే ఉద్యమంలో భాగమయిన నగ్నముని పాటల ఆధిక్యాన్ని ఎక్కడా ఒప్పుకున్నట్టులేదు. ఫ్రీవర్సు వదిలినట్టూ లేదు. పట్టు విడువని విక్రమార్కుడిలా తన భావాలను ఫ్రీవర్సులోనే రాస్తూ వున్నాడు. పాటల ప్రవాహానికి ఎదురీది సామాజిక చైతన్యాన్ని కలిగించే కవిత్వం ఇవాళ తెలుగులో రాయటం సాహసంగా కనిపిస్తుంది. ఆ సాహసం చేస్తున్నందుకు నగ్నమునిని అభినందిస్తున్నాను. ఒట్టి సాహసమే అయితే చాలామంది చేస్తున్నారు. ఫ్రీవర్సును కూడా ఉద్యమోన్ముఖంగా సమర్థంగా వాడుకోవచ్చని 'కొయ్యగుర్రం' లాంటి మహాకావ్యం ద్వారా శక్తిమంతంగా రుజువు చేసినందుకు నగ్నమునిని మరోసారి అభినందిస్తున్నాను.

దుర్దినాలు గుర్తుండ కూడదని కోరుకుంటాం. 1977 నవంబరు 19 తెలుగుజాతి తరతరాలుగా గుర్తుంచుకోవలసిన దుర్దినం.

ఇనప నాడాల్తో
చెక్క హృదయంతో
ధన మదంతో
'అలగాజనం' బుజాల మీద
స్వారీ చేసే కొయ్యగుర్రా
లున్నంతకాలం గుర్తుంచుకోవాల్సిన దుర్దినం

మనిషి బతికుండగా
దాహం తీర్చలేని ఉప్పునీటి సముద్రం
నదుల మంచినీళ్ళని కౌగిలిలోకి లాక్కుని
తనివి తీరా తాగి తాగి
తెగబలిసిన కొండ చిలువలా
మెలికలు తిరిగి
కాలంపై
భూగోళంపై
'అలగాజనం' ముఖాలపై
వృక్షాలపై పక్షులపై
సమస్త జంతుజాలంపై
చీకటి ముసుగు హఠాత్తుగా కప్పి
నీటితో పేనిన తాళ్లతో గొంతులు బిగించి
కెరటాల్తో కాటేసి వికటాట్టహాసంతో
బుసలు కొడుతూ పరవళ్ళు తొక్కిన రోజు
*1977 నవంబరు 19*

కొయ్య గుర్రమెక్కి
కొయ్యకత్తితో వూరేగే ప్రభుత్వానికి
తీరమంతటా గుడిశె వుందని తెలుసు
గుడిసె ముందు పుట్టలున్నాయని తెలుసు
పుట్టలో కోడె నాగులున్నాయని తెలుసు
పడగల్లో విషముందని తెలుసు
అయినా ప్రకృతి విలయతాండవానికి ప్రజల్ని వదిలేసిన పరిపాలకులే

హంతకులన్న విషయం ఈ కావ్యం చదివితే మనం గ్రహించగలం. కొయ్యగుర్రాన్ని తగలబెట్టగల కొత్త ఇంధనాన్ని కనిపెట్టటమే కర్తవ్యం అని కూడా మనకు ఈ కావ్యం గుర్తు చేస్తుంది

పాలకుల పుట్టినరోజు పండుగలకు, మంత్రుల సన్మాన సంచికలకు చెక్క భజన చేసే కవులను వదిలేస్తే (వాళ్ళు ఉప్పెన కవిత్వం రాయటమే కాక కొయ్యగుర్రం తరఫున దివి తాలూకా వెళ్ళి అక్కడ కవి సమ్మేళనాలు జరుపుకున్నారు!) "ఆనాటి దారుణానికి ఇంత గాఢమైన ఆక్రోశం వెల్లడించే కవిత్వాన్ని నేను చూడలేదు." ఇంకో చెప్పుకో దగిన కవిత గద్దర్ రాసిన 'వరద పాట' గద్దర్ పాటలో ఆవేదన కనిపించినంతగా ఆక్రోశం కనిపించదు.

*"తల్లులు చూడంగా బాబు*
*పిల్లలు మునిగారు బాబు*
*పిల్లలు ఏడ్వంగ బాబు*
*తల్లులు మునిగారు బాబు"* అని ప్రజల భాషలో, పలుకుబడిలో హృదయ విదారకంగా గద్దర్ వర్ణించాడు. అయితే, కరిగిన గుండెల్ని కర్తవ్య దీక్షతో గట్టి పరిచే ప్రయత్నం గద్దర్ చెయ్యలేదు. హంతకుల్ని సరిగ్గా నిరూపించలేదు.

*"దివిసీమ అంతనూ బాబూ*
*ఎర్ర సీమైతేను బాబూ*
*ఏటి బాదలు పోవు బాబూ*
*కోటి బాదలు తీరు బాబూ"* అని
ఒక సందేశంతో పాట ముగుస్తుంది. ఈ ముగింపుకు అవసరమైన వాతావరణం, పరిణామం పాటలో కనిపించవు.

1977 నవంబరు 19 నాటి ఉప్పెన వల్ల జరిగిన దారుణాల కారణాల లోతుల్లోకి వెళ్ళి ఆక్రోశాన్ని వెల్లడించి, తుపాను వ్యవస్థ మీద మనకు ఆగ్రహాన్ని కలిగించటం 'కొయ్యగుర్రం' అనే ఈ కావ్య లక్షణం. ప్రకృతి చేసిన విలయ తాండవాన్ని ఇంత సమర్థంగా వర్ణించిన ఇంకో కావ్యం నా దృష్టికి రాలేదు. ఈ సందర్భంలో అవినీతిపరుల అసమర్థ పరిపాలకులను హంతకులుగా నిరూపించిన ఇంకో కావ్యం కూడా నా దృష్టికి రాలేదు. ఇది ఫ్రీవర్సుకే సంబంధించింది కాదు, తెలుగు కవిత్వానికి సంబంధించింది. 1977 నవంబరు తుపాను మొదటిదీ కాదు, చివరిదీ కాదు. 1969 మే తుపానులో కొన్ని ఊళ్ళే కొట్టుకుపోయిన జ్ఞాపకాలు ఇంకా మాసిపోలేదు. 1978 గుజరాత్

వరదల నష్టం నిన్న మొన్నటిదే. ఏటేటా దేశంలో తుపానులు, వరదలు వస్తూనే ఉంటై. పేద ప్రజలు చలికో, వరదకో, తుపానుకో బలిఅవుతూనే ఉంటారు. కొయ్య గుర్రం మీద ఊరేగే ప్రభుత్వాలకు ఇవి పట్టవు. వాళ్ళకు కావలసిన కాంట్రాక్టర్లున్నారు. కానుకలిస్తారు. ఎన్నికల తంతు యధావిధిగా జరుగుతుంది. చెక్క హృదయపు కొయ్య గుర్రం సిగ్గు విడిచి ఊరేగుతూనే ఉంటుంది. దాన్ని తగలబెట్టడం ఒకటే పరిష్కార మార్గం. అదే ఈ మహాకావ్యం ఇచ్చే సందేశం. 1977 నాటి సంఘటన ఈ కావ్యానికి ప్రత్యక్ష ప్రేరణ మాత్రమే. అసలు సమస్య ఒక సంఘటనకు పరిమితమయినది కాదు. అట్లాగే ఈ కావ్యం కూడా.

ఇంతకాలంగా ఈ కావ్యం 'ప్రజాతంత్ర' పుటల్లోనే వుండి పోయిందనే సంగతి తెలుగులో మంచి కవిత్వం కోసం రకరకాల పత్రికల్ని గాలించే పాఠకులకు తెలుసు. కాని, అధిక ప్రచారం లేని, అన్ని చోట్ల దొరకని, ఒకమారుమూల పత్రికలో అచ్చుకావటం వల్ల ఈ కావ్యాన్ని ఎరగని వాళ్లు ఇంకా ఉండొచ్చు. ఇంత గొప్ప కావ్యం ఇన్నాళ్లు (ఆధునిక కాలమానంలో రెండేళ్ళు సుదీర్ఘమైన కాలం) 'ప్రజాతంత్ర' పుటల్లోనే ఉండిపోవటం మన దురదృష్టం. దీని స్థానం మనందరి హృదయాల్లో, మన ఆలోచనల్లో, మన కార్యాచరణలో, కర్తవ్య దీక్షలో.

నేను ఇంతగా మెచ్చుకునే ఈ కావ్యంలో గొప్పదనం ఏమిటి? అనే ప్రశ్న ఈ కావ్యపాఠకుల్లో కొందరికైనా రావచ్చు (నిజానికి కావ్యం చదివేవాళ్లకి ఇట్లాంటి ప్రశ్నలు రాకూడదు) కవి ఆవేదనకు, ఆక్రోశానికి,ఆగ్రహానికి ఫలితం ఈ కావ్యం. ఇంతవరకూ చెప్పినవి కాక చెప్పగలిగిన కారణాలు మరికొన్ని చెబుతాను.

అతి దారుణమైన, అత్యంత అనూహ్యమైన సంఘటన జరిగినప్పుడు స్పందించే కవి హృదయంలో ఎట్లాంటి భావ సంఘర్షణ జరుగుతుందో అదంతా ఈ కావ్యంలో కనిపిస్తుంది. బాధ, నిర్వేదం, కోపం, వైరాగ్యం – ఇవన్నీ ఒక్కోసారి వేరువేరుగానూ, ఇంకోసారి కలిసిపోయీ ఈ కావ్యంలో కనిపిస్తయ్. మనలోనూ సహానుభూతిని కలిగిస్తయ్.

సాంఘిక ప్రయోజనం దృష్టితో రాసిన రచనలను విమర్శించే టప్పుడు మన విమర్శకులకు యాంత్రిక పద్ధతి ఒకటి అలవాటయి పోయింది. ఆ దృష్టితో 'చదివితే'....

నాకు చంద్రమండలం వొద్దు
విమాన యానాలు వొద్దు
కాలాన్నీ జీవితాన్నీ కలుషితం చేసే
రాజకీయ కార్యకలాపాలొద్దు
రైళ్లొద్దు బస్సులొద్దు
ఈ నాగరికత రద్దీ వొద్దు
పాతరాతి యుగం పనిముట్టు పట్టుకుని
చరిత్ర చీకటి కోణాల గుహల్లోకి
వెళ్ళిపోతాను –

వంటి వాక్యాలు చదివినప్పుడు కవి నాగరికతను వద్దని రాబిన్ హుడ్ లాగా ఎక్కడికో వెళ్ళి కొత్త జీవితం, ఊహాకల్పితమైన జీవితాన్ని గుడుపుదామను కుంటున్నాడని యాంత్రికంగా విమర్శించటానికి వీలుంది.

కానీ, మానవజాతి కంతటికీ తనను సంకేతంగా చేసుకొని తాను ఏమీ చెయ్యలేనితనానికి సిగ్గుపడి కొత్త జీవితాన్ని ప్రారంభిస్తున్నానని చెప్పటం ఇక్కడ ఆయన ఉద్దేశం. చరిత్రలో కనీవినీ ఎరుగని దారుణ సంఘటనలు జరిగినప్పుడు హేతువాద దృష్టితో ఆలోచించటం అన్ని వేళలా సాధ్యం కాదు. స్పందించే కవికి అది మరీ కష్టం. అందువల్ల, అసలు ఈ ప్రపంచం మీద, ఈ నాగరికత మీద అసయ్యం పుట్టటం అసహజం కాదు. దీన్ని నిరాశావాదమనీ, కాల్పనికవాదమనీ, ఇంకా ఇట్లాంటి అరిగిపోయిన మాటలతో పేర్లు పెట్టటం తేలికే. ఎప్పుడో సరిగ్గా గుర్తులేదు గాని, ఇరవయ్యేళ్ళకు పూర్వమే ఒకానొక విమర్శకుడు శ్రీశ్రీ 'దేశ చరిత్రలు' అనే గేయంలో –

'ఏ దేశ చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం'

అన్న పాదాలనుదహరించి శ్రీశ్రీని నిరాశావాదిగా చిత్రించాడు. అతను, నా జ్ఞాపకాన్ని బట్టి, కమ్యూనిస్టు విమర్శకుడు. అప్పుడు చంద్రరాజేశ్వరరావుగారు జోక్యం చేసుకుని ఆ విమర్శకుణ్ణి ఖండించారు. ఆ విమర్శకుడు తన పొరపాటును ఒప్పుకున్నట్లు ఇక్కడ చెప్పటం న్యాయం. ఆ రకమైన యాంత్రిక విమర్శలకు ఎప్పుడూ అవకాశం ఉంటూనే ఉంటుంది

గనకే ఈ విషయాన్ని గురించి ఇంతగా చెప్పాను. నగ్నముని మీద ఇట్లాంటి ఆరోపణలు చెయ్యటానికి అవకాశాలు ఎక్కువ. అట్లాగే –

*ఇప్పుడు ఎవరయినా ఎవర్నయినా కొత్తగా చంపేదేమిటి?*
*ఏ క్షణంలో దేవుడు పుట్టాడో*
*ఏ క్షణంలో విధిరాత నుదిటిపై*
*లిఖించబడిందన్నారో*
*ఆ క్షణమే మనిషి చచ్చాడు*
*కర్తవ్యం చచ్చింది*
*ఇప్పుడు కొత్తగా ఎవరయినా ఎవర్నయినా చంపేదేమిటి?*
*ఇప్పుడు కొత్తగా సముద్రం చంపేదేమిటి?*
*ఇప్పుడు కొత్తగా కొయ్యగుర్రం చంపేదేమిటి?*

అన్నప్పుడు నిరాశా వాదమో, సినిసిజమో కనిపించవచ్చు. కాని మనిషికి జరిగే అన్యాయానికి విధి కారణమనుకునే అజ్ఞానాన్ని విమర్శించటమే ఇక్కడ నగ్నముని చేసింది. ఆ రకమైన భ్రమల నుంచి వాస్తవ దృక్పథం వైపు చూపు మళ్ళించటమే కవి లక్ష్యం. దేవుడు, విధి అనే భావాలు కర్తవ్యదీక్షను ఎట్లా చంపేస్తయ్యో సూచించటమే కవి ఇక్కడ ఉద్దేశించింది.

*బక్కటెద్దులు వెంటరాగా నాగలి బుజాన వేసుకుని*
*పొలం వెళ్లే ప్రతిరైతూ నాకు శిలువ మోస్తున్న*
*జీసస్‌లా కనిపిస్తాడు*

– అన్నప్పుడూ

*మానవుడి మనసులో మాత్రం మహాబోధి*
*ఎప్పుడో కూలిపోయింది"*

అన్నప్పుడూ

నగ్నముని మత సంబంధమైన ప్రతీకలను వాడాడని విమర్శించే అవకాశం ఉంది. ఇక్కడ 'జీసస్' నీ 'మహాబోధి' నీ వాడింది మత సంకేతాలుగా కాదు. కావ్యంలోనే ఇంకోచోట చెప్పినట్టు "చివరికి తన నెవరు మోసం చేస్తారో జీసస్‌కి తెలుసు". నాగలి మోస్తున్న రైతులను జీసస్‌తో పోల్చడం వల్ల హంతకులెవరో తెలుసుకోమన్న హెచ్చరిక ఉంది. అట్లాగే 'మహాబోధి' జ్ఞానానికి సంకేతం. మానవుడి జ్ఞానం అసమర్థమైపోయిందన్న బాధ ఇక్కడుంది. ఇంకోచోట సూచించినట్లుగా 'జీవితం సాంకేతికమైన జ్ఞాననేత్రం

తెరుస్తుందనడం అబద్ధం. పెరిగిన సాంకేతిక జ్ఞాననేత్రాన్ని తెరవకపోవడం వల్ల ఆ విజ్ఞానం అవసరమైన చోట అవసరమైన వారికి ఉపయోగపడకుండా పోయింది.

నిజానికి ఈ కావ్యానికి వ్యాఖ్యానాలు, వివరణలు అవసరమని నేననుకోవటం లేదు. నగ్నముని ఇతర కవితల్తో పోలిస్తే ఇంత స్పష్టత ఉన్న కవిత ఇంకోటి దొరకదు.

"కొయ్యగుర్రం
స్తబ్దతకీ, మూర్ఖతకీ, అజ్ఞానానికీ, అహంకారానికీ
అసమర్థ పరిపాలనకీ ప్రతీక"

అని తను ఏ ప్రతీకను ఎందుకు వాడాడో కూడా తెలుపుతున్నాడు. నగ్నముని కవిత్వంలో ప్రతీకల గందరగోళం ఎక్కువనీ ఆయన వాక్యాల్లో 'సింటాక్సు' (Syntax) సరిగ్గా ఉండదనీ ఒకప్పుడు గోల పెట్టిన వాణ్ణే. కాని సంకేతాల్ని మరీ ఇంత స్పష్టంగా వివరించాలని కూడా నేను ఆశించలేదు.

సామాజిక ప్రయోజనం దృష్ట్యా రాసే కవిత్వం ఈనాడు ఎక్కువగా వస్తున్నది. అందులో కొంత ఉద్యమాల్లో మమైక్యం చెందిన వాళ్ళ నుంచి, మరికొంత ఉద్యమ సానుభూతి పరుల నుంచి. రెండు రకాలుగా మంచి కవిత్వమే వస్తున్నది. మార్గాల్లో భిన్నత్వం కవిత్వానికి గుణాన్ని కూర్చి పెడుతున్నది. అయితే కవిత్వాన్ని విశ్లేషించి వ్యాఖ్యానించే విమర్శా సాహిత్యం అవసరమయినంతగా వస్తున్నట్టు లేదు. వచ్చిన కొద్ది విమర్శల్లో కూడా యాంత్రిక ధోరణులు తరచుగా వస్తున్నయ్. నగ్నముని కవిత్వం మీద ఇట్లాంటి విమర్శలు వచ్చే అవకాశం ఇంకా ఎక్కువ వుంది గనుక ఈ ఒకటి రెండు వివరణలు ఇచ్చాను.

ఈ 'కొయ్యగుర్రం' మహాకావ్యం అంటున్నాను. ఒక కవిత మహాకావ్యం కావటానికి చాలా విషయాలు కారణమవుతై. కావ్యవస్తువు, కవితా పద్ధతి, రచనా వైవిధ్యం, సందేశం- ఇట్లాంటి విషయాలన్నిట్లోనూ కవి ప్రతిభ వల్ల కావ్యం మహాకావ్యం అవుతుంది. ఈ కావ్యంలో వస్తువు ఉదాత్తమని చెప్పక్కర్లేదు. కొయ్యగుర్రాన్నెక్కి ఊరేగే అసమర్థ ప్రభుత్వాల్ని హంతకుల్నిగా నిరూపించి కొయ్యగుర్రాన్ని తగలబెట్టే ఇంధనాన్ని సమకూర్చుకోమనే సందేశం ఈ కావ్యంలో ఉంది. రచనా పద్ధతిలో నగ్నముని సాధించిన విశేషాలు అతని ప్రత్యేకతను నిలబెడుతున్నయ్.

కవిత్వంలో ప్రతిపాదించే విషయానికి బలం చేకూర్చే గొప్ప వాక్యాలు ఈ కావ్యంలో వాలంటీర్లలా కవిత్వానికి దారిచూపుతై...

*హంతకులెవరో నాకు తెలుసు*
*నెపం కాసేపు సముద్రం మీదకి తోస్తాను*
*అయినా మరేం ఫర్వాలేదు*
*కంకాళం సంజాయిషీ కోరదు*
*మరేం ఫర్వాలేదు*
*అనాధ ప్రేతం సంజాయిషీ కోరదు!*
*జెండా కన్నీరు కార్చదు.*

పూర్వం 1964లో కాబోలు అజంతా 'జెండాలకు కన్నీళ్ళు లేవు' అనే శీర్షికతో ఒక కవిత రాశాడు. అయితే ఇక్కడ నగ్నముని వాడిన తీరు వేరు. అజంతా జెండాని సామ్రాజ్యవాదానికి సంకేతంగా వాడుకున్నాడు. నగ్నముని కొయ్యగుర్రపు చెక్క హృదయానికి సంకేతంగా వాడాడు.

ఫ్రీవర్సులో ఒకే శైలిని సాగదీస్తూ విసుగెత్తించటం తేలిక, ప్రతిభా వంతుడైన కవి భావాలతో పాటు రచనలలో కూడా వెరైటీ చూపిస్తాడు. ఈ విషయంలో నగ్నముని పడ్డ జాగ్రత్త మనం స్పష్టంగా గుర్తించవచ్చు. అందాన్ని ఆనందాన్ని గుర్తు చేసుకునే చోట కృష్ణశాస్త్రి గారితో పోటీ పడుతూ–

*"ఒకప్పుడు ఇక్కడో వూరు వుండేది*
*పక్షుల బారులు కొంటెగా పళ్ళు కొరికి*
*గుసగుసలు పోయేవి*
*ఒకప్పుడు ఇక్కడ బంగారం బరువుకి ఒరిగి*
*పొలాలు హొయలు హొయలుగా నృత్యం చేసేవి.*

ఈపై వాక్యాల్లో కింద గీతలు పెట్టిన పదాల ఎన్నిక, మొత్తంలో పదాల పొందిక చెప్పదల్చుకున్న అందమైన భావనకు తగిన శైలీ లాలిత్యాన్ని సమకూర్చినై. అవసరానికి పనికిరాని మన సాంకేతిక విజ్ఞానాన్ని అవక్షేపించే చోట–

'రోడ్ల పక్క ప్లాస్టిక్ చెట్లు నాటుదాం
ప్లాస్టిక్ కొమ్మలపై ప్లాస్టిక్ పక్షుల్ని కూచోబెడదాం
ప్లాస్టిక్ కంకులు నాటి
పొలాలు బంగారం పండినట్లు చూపుదాం

జనం ఆనందంగా ఆడుకుంటూ పాడుకుంటూ జీవిస్తున్నట్లు
ప్లాస్టిక్ ఆవుల ప్లాస్టిక్ గేదెల ప్లాస్టిక్ పొదుగులు పితుక్కుని
ప్లాస్టిక్ పాలు తాగుదాం
కొయ్యగుర్రాన్ని ఒహోం ఒహోం అంటూ
జీవితాంతం మోద్దాం!

ప్లాస్టిక్ ఇమేజరీ సామాన్యమైన వాటి నుంచి అసామాన్యమైన వాటి వరకు పొడిగించి సాధించిన శైలి అవక్షేపాన్ని సరిగ్గా వ్యక్తం చేస్తున్నది. ఈ అవక్షేపాన్ని ప్లాస్టిక్‌తో అంతం చెయ్యకుండా పల్లకిలాగా కొయ్యగుర్రాన్ని మోయటం సూచించటం వల్ల అనవసరమైన పొడిగింపు (monotony) పోయి వెరైటీ వచ్చింది. ఒకే భావాన్ని శైలీ భేదాలతో వ్యక్తీకరించటం వల్ల భావానికి బలం కలుగుతుంది.

కొంత విస్తారమైన కావ్యంలో భావాల్లోనూ, భావ వ్యక్తీకరణలోనూ శైలిలోనూ వెరైటీ సాధించటం అవసరం. అత్యంత విరుద్ధమైన భావాల్లో ఒక దాన్నుంచి ఇంకోదానికి దూకిస్తాడు నగ్నముని. వెరైటీ సాధించడానికి ఇతను పాటించే పద్ధతుల్లో ఇదొకటి. చాలా తాత్వికంగా–

"జీవితాన్ని మించిన నిశ్శబ్దం
వెలుతుర్ని మించిన నిశ్శబ్దం
శబ్దాన్ని మించిన నిశ్శబ్దం
వేగాన్ని మించిన నిశ్శబ్దం
విశ్వాన్ని ఆక్రమించి
శవం కన్నుల్లో నిలిచిపోయిన
నిశ్శబ్దం.

అని వర్ణించిన 'మహా నిశ్శబ్దం' తరువాత కవి వెంటనే చిన్న పిల్లాడయి పోయి

'సముద్రం' గుర్తుందా నీకు
చిన్నప్పుడు
తెల్లటి నురగల్తో బొచ్చుకుక్క పిల్లలా
నువ్వు నా కాళ్ళ చుట్టూ చుట్టేసుకుంటూ తిరిగినప్పుడు
అలల నాలికల్తో నా పాదాల్ని నాకినప్పుడు
నిన్ను అమాయకపు ప్రాణివనుకున్నాను
నిన్ను పెంచుకుందామనుకున్నాను

నీ ఘోష మాన్పి లాలిద్దామనుకున్నాను

అని సముద్రాన్ని బుజ్జగిస్తున్నాడు. పూర్వ ఖండిక (9) 'నిశ్శబ్దం'తో ముగుస్తుంది. తరవాత ఖండిక (10)లో 'ఘోష' వినిపిస్తుంది. పూర్వ ఖండికలో తాత్విక గాంభీర్యం వ్యక్తమయితే తరవాత ఖండిక ప్రారంభంలో చిన్న పిల్లల అమాయికత మెత్తని చేత్తో తాకుతుంది. పూర్వ ఖండికలో రంగం ఆకాశంలో నక్షత్రాల కవతల ఉంది. తరవాత ఖండంలో రంగం కళ్ళకెదురుగా ఈ నేల మీదే ఉంది.

భావాల్లో వైరుధ్యాన్ని (పోలారిటీని) ఇన్ని రకాలుగా సూచించటం వల్ల పాఠకుడి మనసులో భావ సంఘర్షణ, సమ్మేళనాలను కలిగించి కవితామయం చేస్తుంది. మహాకావ్య రచన చేస్తున్న కవి మాత్రమే చెయ్యగలిగిన పనులివి.

ప్రజలను ముంచెత్తిన ప్రళయాన్ని వస్తువుగా తీసుకొని మహాకావ్యం రాసేటప్పుడు ఫార్ములా పద్ధతి కవిత్వం రాయటం కుదరదు. అందువల్ల ఈ కావ్యంలో ప్రజల బాధలను వర్ణించేసి ఒక సందేశంతో పూర్తి చెయ్యలేదు. ఉప్పెన కలిగించిన నష్టమూ ఉంది, కారణాల లోతుల్లోకి పోయాడు, సందేశమూ ఉంది. వీటన్నిటినీ మామూలు కవిగా కాక తాత్వికుడుగా మానవ నాగరికత, జీవిత ధ్యేయం మొదలైన వాటిని గురించి చేసిన ఆలోచన, పడిన తపన ఇందులో కనిపిస్తయ్.

*ఆలోచనకీ మనిషికీ వున్న సంబంధం ఏమిటి?*
*భాషకీ భావానికీ వున్న సంబంధం ఏమిటి?*
*వేదనకీ శరీరానికీ వున్న సంబంధం ఏమిటి?*
*నేలకీ నీటికీ వున్న సంబంధం ఏమిటి?*

అనే మూల భూతమైన ప్రశ్నలు వేసుకుంటాడు. ఈ రకపు తాత్వికమైన ఆలోచనా పద్ధతి (Philosophical tone) కావ్యమంతటా కనిపిస్తుంది. దాన్ని గుర్తించి చదివినప్పుడే ఈ కావ్యం మనకు పూర్తిగా అర్థమవుతుంది. కవి ఒక్కోసారి పోట్లాడి చింపిన విస్తరి వంటి ఆకాశంలో, చిందరవందరైన మెతుకుల్లాంటి నక్షత్రాలకవతలికి పోయి చూస్తాడు. చరిత్రలో నుంచి సరాసరి నేల మీదికి వచ్చి సముద్ర ఘోష వింటాడు. చరిత్రలో వెనక్కి వెళ్ళి జీసస్‌ను స్మరిస్తాడు. బుద్ధుడిని వదిలి అశ్రునయనాల్తో తిరిగివచ్చిన గుర్రాన్ని గుర్తు చేసుకుంటాడు. మళ్ళీ ఇప్పటి కొయ్యగుర్రాల్ని గురించి చెపుతాడు. సమస్త విశ్వాన్నీ సమస్త కాలాన్నీ రంగం చేసుకున్నట్టుగా కనిపిస్తుంది. ఆలోచనలకు

అవధుల్లేకపోవటం వల్ల అవి తాత్విక స్థాయికి చేరినై. కావ్యం–మహాకావ్య స్థాయికి ఎదిగింది.

ఇంతటి గొప్ప కావ్యం పత్రికల పుటల్లోనుంచి రెండేళ్ళ తరువాతయినా బయటికొస్తున్నందుకు నాతో పాటు కవితాభిమానులంతా సంతోషిస్తారనుకుంటాను. అంతేకాక ఈ కావ్యం ఒక్కటే ఒక ప్రత్యేక పుస్తకంగా తీసుకురావటంలో కనిపించే అభిరుచిని మెచ్చుకుంటున్నాను.

ఈ ఆధునిక మహాకావ్యంలో నేను గుర్తించిన విశేషాలను ఈ పుస్తకంతో పాటే చెప్పుకునే అవకాశం కలిగినందుకు సంతోషిస్తున్నాను.

హైదరాబాదు

1979 డిసెంబరు — చేకూరి రామారావు



# జార్జ్‌మాండెల్ / నగ్నమునీ

an interior dialogue

ఇంతకీ ఎవర్నువ్వు?/ప్రత్యేకంగా నేనెవర్నీ కాను నన్ను సముద్రంలోకి నెట్టారు అదే నా ఆనవాలు/సముద్రంలోకా? ఎవర్నిన్నలా తోసింది?/రాయీ రప్పా ఇనుమూ పెనమూ రొదా రోదనా వ్యథా వేదనా అసహ్యమూ అబద్ధమూ వాసనా వేషమూ నీతీ బుకాయింపూ నిరానందమూ మదాంధతా/ఆగాగు కాసేపు ఆనందిద్దాం పీతల్ని తిందాం ఇక్కడ కాకపోతే ఇంకెక్కడేనా నీ ఒళ్లో పడుకొని/ అయితే పద వడగళ్ల వాన వాడిలోకి ఎండ్రకాయి చితిపిన మాంసాల లజ్జల ఒడిలోకి/జానీ జానీ వెక్కిళ్ళల్లోంచి అడుగుతున్నాను ఎవర్నిన్నిలా సముద్ర మృత్యు తొడల సందుల్లోకి నొక్కింది?/నేను రాను బయటికి వాడా లంజాకొడుకు నంజుకు తింటాడు నన్ను స్వార్థాన్ని ఒడ్డున కొరుకు తింటున్నాడు నేను రాను రాను రాను నన్ను ఆ లంజకొడుకు నంజుకు తింటాడు వాడి నాలుక చీలికలయ్యే దాకా / జానీ జానీ ఒక్కసారి ఆ లోతుల్లోంచి తేలి తేలి ఈది ఈది ఒక్కసారి నా కోసం అలలా రా రారా నా జానీ రారా నాయనా నా జానీ / ఒద్దు పురుగులు క్రిములు కీటకాలు నల్లులు బల్లులు గుల్లలు / సరిగ్గా వినపట్టం లేదు నీ భయపు దుఃఖసాగర ఘోర ఘోషలో సముద్రాశ్వాల హేషల్లో ఒచ్చి నత్తగుల్లలాంటి నీ చెవిలో ఒడిలో ఒక్కసారి చెప్పు ఎవరు నిన్నా కెరటాల్లోకి విరిచింది విసిరేసింది! / నన్నా! కుక్కలు క్రూర జంతువులు నా కన్నీళ్ళు నా విశ్వాసాల పొగలు నా గొంతులోంచి పెగలలేని సెగల పొగల కన్నీళ్ళ కార్చిచ్చు మసి దుమ్ము ముఖం మీద కణితెలు గుమాస్తాలు గోమాతలు ప్రభుత్వాలు చట్టాల చట్రాలు న్యాయాల అధర్మాల నీతుల గోతులు సరిహద్దులు గోడలు దుకాణాల కొనుగోళ్ళు అమ్మకాల కొనుగోళ్ళు వర్గాల కులాల మతాల నిమ్నోన్నతాలు ఔన్నత్యాల గొడ్రాళ్ళ గర్వాల అహంకారాలు ముదిరిన గడ్డకట్టిన ముఖాలు పంచదారలాంటి పేరాశల దురాశల మీద దుర్మాంసం మీద వాలిన చీమల్ని తోలే ఈగల పూజారుల మంత్రుల తంతామనే తంత్రాల భయాందోళనల నెత్తిమీద శఠగోపాల దండాల అరదండల లాఠీల బాకుల

చాకుల తుపాకీల సదాచార నీతుల స్మశానాల గోతులు తవ్వే పోలీసుల పారలు పలుగులు పగిలిన ఎలుగుల ఆక్రందనాలు ఆర్తరావాలు పంతుళ్ళు హోదాల గోదాల బళ్ళుచచ్చిన ఆదివారాల చర్చిపాటలు క్రీస్తువైను క్రీస్తు రొట్టి పలాయనం నాటిన శిక్షణాయలాల తొడల మీద పాకిన తొండలు సినిమాల అసమయాల సీమల రెక్కల విప్పుడు చప్పుడు పేకాటల పక్క చూపుల పాకుడు రాళ్ళ కళ్ళ డబ్బులు మూగిన సారా ఈగలు రేడియోల బండబారిన వేళ్ళు కొదుతున్న గొంతులు గొడ్డళ్ళు టెలివిజన్ కన్రెప్పల అశ్లీలపు అన్వేషణ తల్లిదండ్రులు వాళ్లలమ్డీ తల్లిదండ్రులు అబద్దాల పెంటపోగులు వాటి నుంచి వీచే అశుద్ధాల పరిమళాలు చివరికి మృత్యువు.

నన్నీ సముద్రంలోకి నెట్టింది తోసింది తన్నింది ముంచింది పీక నులిమింది గుంజింది గింజింది ఔనా ప్రియతమా ఒక్క నువ్వు తప్ప

(జార్జి మాండెల్ రచన 'ది బెకనింగ్ సీ'లోని కొన్ని కెరటాలను దోసిట్లో పట్టుకొన్న ప్రయత్నమిది)

"నా రక్తం నిండా విశ్వ రహస్యముద్రాల జంత్ర వాద్యాలు (హృదిక్) నా ప్రశ్నలకు తలవంచుకు వెనక్కు మళ్ళే - సముద్ర కెరటాల్లారా (మా) సముద్రాల్ని బంధించానని సాహసంగా నవ్వుతున్న కొన్ని - చేతివేళ్ళు (జైల్లో సముద్రం) అయినా - సముద్రాలు నా మీద పొర్లుకొచ్చినా - నిద్ర నటిస్తోన్న వాళ్ళ కళ్ళరెప్పల్ని పీకేయడం మాత్రం మానను (కొజ్జాల కామకేళి చూస్తున్నాను) ప్రళయంగా నవ్వులు - వరదగా నవ్వులు - ప్రళయ వరద తుపాను నవ్వులు - ప్రమాదం సూచిస్తూ నవ్వులు - ప్రమాదం కక్కుతూ నవ్వులు (అణుదిక్) అనవరతం అశాంతిని ఘోషించే - ఓయి దుఃఖ మూగ సముద్రమా - నీకు నమస్కరిస్తున్నాను - నీకు అభయ హస్తమిస్తున్నాను (నమస్దీవెన) నదులు నిజస్వరూపం చూసుకుందామని - సముద్రంలోకి దూకి నిర్వాణం చెందుతున్నాయి - సముద్రం వేదఘోష పెడుతోంది (భిన్నస్వరాలు) ఆవేశం - సముద్రమల్లే నా మాటవిని - పొర్లుకుంటూ పాదాల్ని కడిగి - ఒదలని తెల్లకుక్కపిల్ల మల్లె కాళ్ళ చుట్టూ తిరుగుతున్నట్లు (వర్షం పడుతోంది) తప్పదు - గతం తవ్వుకుంటే - సముద్రం ఘనీభవిస్తుంది (విను) ఒంటిమీద ఒక్కొక్క కెరటం వాలిచే - సిన - గ్నంగా ఉద్వి - గ్నంగా న - ర్తిస్తోం - ది నా

ముం- దు - సముద్ర-ం! (లాండ్‌స్కేప్) సముద్రం తెగుతుంది. సమస్తాన్నీ తెంపుతుంది - హోరుమని ఉద్దయంగా మారుతుంది (సముద్రం)"★

★(అన్నీ నగ్నమునివే అక్కడక్కడ తెగిన పాదాల గాయాలు) ఒక శాంటియాగో ఒక యాహెబ్ ఒక ప్రాస్పెరో ఒక మాసెఫీల్డ్ ఒక 'క్రాడిల్' విట్మన్, 'ఎండ్‌లెస్లీ రాకింగ్' ఒక 'ది స్టార్మ్ రైజెస్' 'వర్జిల్ ఒక 'సీ లలబీ' ఎలినార్ వైలీ, ఒక లార్డ్ జిమ్, ఒక యూలిసిస్ శాసించగలరు. సముద్రాన్ని శపించగలరు. వాడెవడో ఒక బాదెలేర్ బాటమ్‌లెస్ పిట్ నుండి పైకి తన్నుకు రాగలడు బుగ్గలా "హెవెన్ హోవన్' అని మతల మడత నలగని తెల్లని ఆపాదమస్తక వస్త్రంలో సర్దుకుపోగలడు హాప్కిన్స్. సముద్రాన్ని గిచ్చి గిల్లి బ్లేడు పెట్టి కోసి చివరికి చేసేందేం లేక మనమంతా ఒంటేలుకు పొయొచ్చు దాంట్లో 'ఇంతేనటే సంద్రమెంతో యనుకొంటి / మనకు సూరీడుకూ మద్దె నుందేనా' అని ఆ పిచ్చి ప్రాకృతపు పిల్ల అచ్చెరువొందవచ్చు. ఉపనిషత్తుల్లో ప్రాథమిక నైసర్గిక అనాగరిక అచ్చమైన కవితాత్మని విన్పించవచ్చు. పురాణాల పాల సముద్రాల ఫోం పరుపుల మీద మనమంతా పవ్వళించవొచ్చు. 'ఆ మహాక్రూర జలరాశి యందనంత / భంగములు దగ్గరతుల నుప్పొంగుననుము / అచట, నా ప్రేమయను మఱ్ఱియాకు పఱచి / నేను పవళించెదను సుధానిభృతమూర్తి/ యని నాయనిలా మనమును యనుకొనవచ్చును. ప్రమాదము లేదు.

హత్యకి ఆత్మహత్యకీ తేడా ఏమిటి? జానీ (జార్జ్ మాండెల్ రాసిన కథ 'ది బెకనింగ్ సీ') నగ్నముని మృత్యువు నిజమన్న మౌనాన్ని మిగిల్చిపోయిన శవం నిజమన్న దరిద్రం చిమ్మే చీకటి నిజమన్న ఉప్పునీళ్ళు నిజమన్న తీరమంతా గుడిసెలున్న గుడిసెలముందు పుట్టలున్న పుట్టల్లో కోడెనాగులున్న పడగల్లో విషమున్న కెరటాలపై కనపడని రక్తపు మరకలున్న నీటితో పేనిన తాళ్ళతో గొంతులు బిగించి కెరటాల్తో కాటేసి వికటాట్ట హాసాలతో బుసలు కొడుతూ పరవళ్ళు తొక్కుతూ ఉమికిన దుమికిన నవంబర్ 19, 1977 సముద్రము సామూహిక హత్యకూ సంబంధమేమిటి?

జానీ ఆత్మహత్య చేసుకోబోయాడు

సముద్రం జానీలని హత్య చేయబోయింది

నగ్నముని జానీ ప్రియురాలు

సముద్రవేం చేస్తుంది హత్య? నిద్రలో దాని మానాన అది

పడుకొంటుంది. కాకపోతే పాపం కలవరింతల్లో ఈ వ్యవస్థ మీద, యీ ఉడెన్ హార్స్ మీద, జానీకి ఈ వ్యవస్థ మీదలా కొయ్యగుర్రం మీద క్రోధం.

అయితే నిజంగా ఎవరు చేసారీ హత్య? నేటి నుండి విసిగి వేసారి పారిపోయి జానీ ఆత్మహత్యా ప్రయత్నం చేసాడో వాటి మీదనే కోపంతో కృద్ధ సముద్రం ఉప్పొంగి పొర్లి పొర్లి తెర్లి తెర్లి వొచ్చింది. ఎవరు హత్యలు చేసారో చేయిస్తున్నారో ఏ వ్యవస్థ చేయిస్తోందో వాటి మీద క్రోధంతో మేక చర్మాల కోసం తిరిగే మెకాల మీద అనుభవాల బంగారపు పంట పండించిన వాడి నోటిలో జిల్లేళ్ళు మొలిపించిన వాళ్ళ మీద నాగలి భుజాన వేసుకొని పొలం వెళ్ళే ప్రతి రైతునీ శిలువ మోస్తున్న జీసస్‌లా చేసిన సాంకేతిక జ్ఞాననేత్రుల మీద జెనీవాలో శాంతి సభలు దేవాలయాల్లో అర్చనలు సత్రాల్లో అన్నదానాలు జరుపుతున్న వాళ్ళ మీద కాబరేల్లో తాదాత్మ్యం చెందుతున్న కళ్ళ మీద బట్టలేసుకొని నగ్నత్వంలోకి పారిపోతున్న నాగరికత మీద హెలికాప్టరులోంచి విమానాల్లోంచి కార్లలో పత్రికా ప్రకటనల్లోంచి దాక్కొని చూచే దొంగ చూపుల మీద బలహీనుడు సృష్టించిన సంపదని మింగి బలవంతుడు పంచిన దరిద్రం మీద

నగ్నముని సముద్రం కత్తిదూసి హత్య చేసింది.

ఇపుడు జానీ మాటల్ని నగ్నముని నోటనిలా పల్కించొచ్చు ఇంతకీ ఎవర్నువ్వు? / నేనొట్టి ఉప్పునీళ్ళని / ఎందుకొచ్చావ్ ఉప్పెనలా/ నన్నీ ఛండాలపు నేలమీదకి నెట్టారు / ఎందుకు ఎవరెందుకు / రాయీ రప్పా ఇనుమూ పెనమూ రొదా రోదనా వ్యథా వేదనా అసహ్యమూ అబద్ధమూ వాసనా వేషమూ నీతీ బుకాయింపూ నిరానందమూ మదాంధతా / వెనక్కు తగ్గు నేను నీ మెర్‌మైడ్‌ని/ ఈ లంజాకొడుకులు స్వార్థాన్ని నంజుకు తింటున్నారు. మనుషుల్ని సుతారంగా ఫోర్కెల్తో మునిపంటికంటించుకొంటున్నారు.జీవితం మిధ్య అంటున్నారు. వాళ్ళు కాకులు శవాల కళేబరాల మీద పుళ్ళు పొడుచుకు తింటున్న కాకులు విశ్వ శ్రేయః కావ్యమే అంటున్నారు. ప్రబంధనాయకీ తొడల బంధనాల్లో పాదాలకి లేపనాలు పూసుకొని ఎగిరిపోతున్నారు. జానీ జానీ ఆర్తనాదమే జీవికి అన్ని భాషల్లోనూ మిగిలే అంతిమ శబ్దమంటావా / అవును చదువు నా దిగంబర మానవాళి మీద నా రాసిన పాటలు ముఖ్యంగా జైల్లో సముద్రం అయినా

చివరి విందులో నన్నెవరు మోసం చేస్తారో నాకు తెలుసు కవిగా మోసగాడిగా నెపం కాసేపు నా మీదికే నెట్టేసుకుంటాను. ఫర్ గివ్ దెమ్ ఫాదర్ / అవును గానీ నా జానీ నువ్వేమిటి గారీ స్నైడర్‌లా some yips & Barks in the Dark లో లా Each poem grows from an energy-mind-field-dance, and has its own grains. To let it grows to let it speak for itself, is a large part of the work of the poet. A scary chaos fills the heart as 'spi' ritual breath-in 'spi' ration, and is breathed out in to the thing-world as a poem. From there it must to the hearer's under "stand"ing. The widest the gap the more difficult; and the greater the delight when it crosses. If the poem becomes too elliptical it ceases to be a poem in any usual sense. then it may be a mantra, a Koan, or a dharani అంటున్నావు/ అననా మరి నేను సమస్తాన్నీ ఫిష్ ఫ్లెష్ ఫౌల్ సమస్తాన్నీ నమస్త్రీవెన చేస్తున్నాను. ఒక్క ఈ రాజకీయ అమానుషత్వాన్ని సగం పశువు సగం శిశువునీ దక్క. నేను బహుశా ఒకే పాట పాడుతున్నాను నేను జీవితాంతం ఒకే పాట పాడుతాను నా పొట్టలోంచి ఒక పేగుని బయటికి తీసి ఏక్ తారగా వాయిస్తూ వీధి వీధినా పాడుకుంటూ పోతాను నిజాన్ని వినగల ఒకే ఒక చెవి కోసం లోకమంతా గాలి మీద గాలిస్తాను/ జానీ జానీ నా తెల్ల బొచ్చుకుక్క పిల్లా నీకు తెలీదా మానవత్వం ప్రతిరోజూ పుట్టి చచ్చే వెలుగుకిరణం ఎందుకు నీకింకా నీ హత్యా ప్రణవం? / ఎందుకా మీ చంపిన శవాలు సంజాయిషీ కోరవు ఉరితీయబడ్డ శిరస్సులు రహస్యాలు చెప్పవు విదూషకులు చివరి నవ్వుల్లో హత్యలు చేస్తారు సిద్ధార్థుడికి కడసారి వీడ్కోలిచ్చిన అశ్వం ఘోటకి కార్చిన కన్నీటికీ మీ కొయ్యగుర్రం ఇనపనాడాల నయన రూపాయల సకిలింపులకీ ఎన్ని శాలివాహన శకాల యుగాల యుగంతాల వ్యత్యాసం! మహాబోధి కొమ్మల్ని విరుచుకున్న కొయ్యకత్తులు మీవి కూటి గుర్రము మీద బాలీసు నానుకొని ప్రాణాలు లేనట్టి భగవంతుడొచ్చాడు ఊరంత ఊరేగుతూ ఉత్సవము సాగించుతూ కూలిమాటడగండిరా - అన్నాలు చాలవని చెప్పండిరా / జానీ జానీ నా నగ్న సముద్రమా ఓనా Qceanus (Okeanos) నువ్వు నా గ్రీక్ పురానదివి పృధివి చుట్టూ తిరిగి తిరిగి మహాంబుధి వయ్యావు ఇపుడు నాలంగా చుట్టూ గిరగిరా తిరుగు జానీ జానీ నా నగ్న సముద్రమా నా లంగాలో పదిలంగా దాచుకుంటాను

వెక్కిళ్ళల్లోంచి అడుగుతున్నాను ఎవర్నిన్నిలా నేలవాత వేసింది రానాయనా నిన్ను బలంగా కాపాడుకొంటాను / ఒద్దు ప్రియతమా గుర్తుందా నీకు చిన్నప్పుడు తెల్లటి నురగల్తో బొచ్చుకుక్క పిల్లలా నేను నీ కాళ్ళ చుట్టూ చుట్టేసుకుంటూ తిరిగినప్పుడు అలల నాలికల్తో నీ పాదాలని నాకినప్పుడు నన్ను అమాయిక ప్రాణివనుకొన్నావు నన్ను పెంచుకొందామనుకొన్నావు నా ఘోష మాన్పిద్దామనుకొన్నావు కానీ నేనీ లంగ లంగాల్లోకి దూరి కాటేద్దామనుకొన్నాను / ఎంత క్రూరం ప్రకృతీ దేనిమీద నీ వికృతి? / తల్లీ చెల్లీ వల్లీ విను చెప్తా వక్షస్థనా లెపుడూ సూర్యోదయానికే విచ్చుకొంటాయి సత్యానికీ ప్రేమకీ త్యాగానికీ ధూళికీ స్వార్థ త్యాగానికీ బతుక్కీ బతక నివ్వటానికీ విచ్చుకొంటాయి. ఆపిల్ బ్రెస్ట్‌లా ఎన్ని వేలి ముద్రలో ఆ పళ్ళమీద ఎండకీ సూర్యుడికీ మధ్య కురుస్తోన్న వానలో చినుకు చినుకుకీ మధ్య తడసిన దయలో కన్నీళ్ళల్లోకి కూడా రాజకీయాలు ప్రవహించగలవని తెలుసుకొని ఈ క్షణాన నా పెనుకడలి క్షణాన సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ బొగ్గు ముక్కలు చేసి రాబోయే ఫిబ్రవరి 1980 16న మళ్ళీ వొచ్చి నీ కంట్లో చీకటింటినౌతాను కానీ సత్యమా ప్రియతమా – ఒక్క నీవే నాకు పెక్కు నేనులు నీకు – జానీ నా నగ్నమునీ ఎందుకు నీకీ కోపం నీ నీటి ఇనప కౌగిట్లో నన్నే మృత్యుహాస దీవులకు చేరుస్తావ్? / ఓసి నా లంజా ఇపుడు ఎవరయినా ఎవర్నయినా కొత్తగా ప్రేమించేదేమిటి – నట్టనడి సంద్రాన నావలో ఉన్నాను నావ ఒడ్డట్టించుతావ నా సామి నడి నీటిలో ముంచుతావ – అని కొత్తగా పాడే ప్రేమ గీతాలేమిటి ఇపుడు కొత్తగా సముద్రం చంపేదేమిటి / ఇప్పుడు కొయ్యగుర్రం చంపేదేమిటి నా నగ్నమునీ! నా నగ్నత్వంలోకి మునిగి ఓ మాట చెప్పు నువ్వు ఓ కాంట్రాక్టర్‌వి కారాదా సంవత్సరానికో రెండు పైర్లు పంట మీదున్నప్పుడు ఉప్పెనల కాంట్రాక్టులు తీసుకోరాదా జీవితాంతం పదవిని ఒంటిని బట్టగా చుట్టుకోరాదా కన్నీరు కార్చని జెండాలా గాలిని సవాలు చేస్తూ ఆకాశాన్ని రెపరెపల్తో నీ అలల్తో పరిహసించరాదా నువ్వూ ఓ ప్లాస్టిక్ చెట్టువై నీ ప్లాస్టిక్ కొమ్మలపై ప్లాస్టిక్ పక్షులు ప్లాస్టిక్ కంకుల ప్లాస్టిక్ బంగారాన్ని కొరుక్కు తింటూండ నివ్వరాదా నా ప్లాస్టిక్ వక్షోజాల ప్లాస్టిక్ పాలు తాగరాదా నువ్వు? / లేదు నా ప్రియతమా నేను తిరిగి తిరిగి తిరిగి హొయలు హొయలుగా పొగలు పొగలుగా సెగలుగా కెరట కెరట కెరటాలుగా తిరిగి వొచ్చే తుపానుని, ఈ శవాల్ని యీ సమస్త జంతుజాలం కళేబరాల్ని నా లోనే –

**ఖననం చేస్తాను కొయ్యగుర్రాన్ని తగల బెట్టగల కొత్త ఇంధనాన్ని కనిపెడతాను వినాశాయచ దుష్కృతామ్మని**

సరేరా ఒరే నా ప్రియా కొత్త కలల్తో కొత్త విశ్వాసాల్తో నా విశ్వాన్ని నేను దిగంబరం చేసుకొంటాను.

13-1-1980 **వేగుంట మోహన ప్రసాద్**



## "కొయ్యగుర్రం తొలి ఆధునిక మహాకావ్యం" పై ప్రొ॥ చేకూరి రామారావు - ప్రొ॥ వెల్చేరు నారాయణ రావుల చర్చ

(క్లుప్తంగా చేరా - నారా సంవాదం)

28-2-1986 నాటి ఆంధ్రజ్యోతి వీక్లీలో ప్రొ॥ వెల్చేరు నారాయణ రావు గారి ఇంటర్వ్యూ అచ్చయింది. అఫ్సర్ చేశారు. అందులో అనేక సాహిత్యాంశాలపై ఆయన విపులంగా మాట్లాడారు. అలాగే, 'కొయ్యగుర్రం' చే.రా పీఠికపై తన అభిప్రాయం చెప్పారు.

ఆ తర్వాత, దానిపై ప్రొ. చేకూరి రామారావు, ప్రొ. వెల్చేరు నారాయణ రావుల మధ్య అత్యంత విలువైన చర్చ జరిగింది.

ఆంధ్రజ్యోతి వీక్లీలో అది 'చేరా - నారా సంవాదం' శీర్షికతో అచ్చయింది.

దాన్ని ఇక్కడ అందజేస్తున్నాం.

**ఆ చర్చ:**

ప్రశ్న: శ్రీ శ్రీ తర్వాత ....!

ప్రొ॥ వెల్చేరు నారాయణరావు : "ఇప్పుడు శ్రీ శ్రీ తర్వాత స్థానం ఒకటి ఖాళీగా వుంది" అంటూ ఆయన పెద్దగా నవ్వి, "ఎట్లా, ఏదో పెద్ద ఉద్యోగం ఖాళీ పడ్డదనుకోండి, దాని కోసం పోటీ పడుతున్నట్టు ఆ ఖాళీలోకి వెళ్లాలని యిష్టపడుతున్న కవులూ వున్నారు. వాళ్లని ఆఖాళీలోకి పంపాలని కోరుకుంటున్న పాఠకులూ వున్నారు. ప్రస్తుతం నేనైతే ఎవరికీ యివ్వలేను. ఎందుకో నామనసులో ఎవరికీ యివ్వాలనిపించదు.

ప్ర: నగ్నముని 'మహాకావ్యం' మాటేమిటి ?

ప్రొ॥ వెల్చేరు నారాయణ రావు : " చేకూరి రామారావు నగ్నముని

'కొయ్యగుర్రం' కవితకు రాసిన ముందుమాట కొంచెం శ్రద్ధతో స్పష్టంగా రాస్తే బావుండేది. ఆయన ఏమనుకుని రాశాడోగాని అందరూ గొప్పకావ్యం అన్నాడని అనుకున్నారు. దానిమీద చర్చ కూడా జరగలేదు. రూప సంబంధమైన చర్చలో మనం ఎప్పుడూ వెనుకబడుతూనే వున్నాం"

## ప్రొ॥ చేకూరి రామారావు :

28-2-1986 ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రొఫెసర్ వెల్చేరు నారాయణరావుగారితో అఫ్సర్ చేసిన ఇంటర్వ్యూ అచ్చయింది. అందులో –

" శ్రీ శ్రీ తర్వాత స్థానం ఒకటి ఖాళీగా వుంది" అని నారాయణరావుగారు అన్నట్టుగా రిపోర్టు అయింది. సాహిత్యంలో ప్రక్రియా పరమైన విమర్శలో ప్రసిద్ధులైన నారాయణరావుగారు వ్యక్తుల స్థానాల్ని గురించి మాట్లాట్టం ఆశ్చర్యం కలిగించింది. నిజానికి ఆ రకమైన చర్చవల్ల ఏమంత లాభం కలుగదు. యుగకర్త ఎవరు? ఆధునిక కవిత్వానికి పిత గురజాడా ? శ్రీ శ్రీ యా అనే చర్చలు ఎంత ప్రయోజనకరమైనవో ఇదీ అంతే !

ఆ సందర్భంలో నగ్నముని 'మహాకావ్యం' ప్రసక్తి వచ్చింది. అక్కడికి నగ్నముని ఆ స్థానానికి పోటీపడుతున్న అభ్యర్థి అయినట్టు, మహాకావ్య ప్రస్తావన రావటంతోటే కొయ్యగుర్రానికి చేకూరి రామారావు రాసిన పీఠిక ప్రస్తావన కూడా వచ్చింది. ఆ సందర్భంగా ఆ పీఠిక "కొంచెం శ్రద్ధతో, స్పష్టంగా రాస్తే బావుండేది" అని నారాయణ రావుగారు అన్నట్టుగా అచ్చయింది. మహాకావ్యం అంటే గొప్పకావ్యం అనే అర్థంలో నేను వాడలేదు. పూర్వులూ వాడలేదు.

"కొద్దిపాటి చమత్కారాలతో గిలిగింతలు పెట్టి అల్పానుభూతి కలిగించటంకాక సీరియస్ భావాలతో మహానుభూతి కలిగించడం మహా కావ్య ప్రయోజనం అనీ మనం రోజూ చూసే ఖండికలకన్నా పెద్దవిగా ఉంటే తప్ప భిన్న భావాలను చెప్పటం కుదరదు, అంటే మహాకావ్యం కావాలి, మహాకావ్యానికి విస్తీర్ణతే ప్రధానం కాదు కాని అవసరమైన ఒక లక్షణం " అనీ –

"ఒక ప్రధాన వస్తువుతో ఒక తాత్విక చింతనతో సందేశంతో అనేక భావాలతో, మూడ్సుతో, కథ లేకుండా 'అర్బేనిటీ' అనే లక్షణం కలిగివుండి,

తగినంత విస్తారంగా ఉన్న దీర్ఘ కవితను ఆధునిక మహాకావ్యం అంటున్నాను.' అనీ అంత స్పష్టంగా చెప్తే "కొంచెం శ్రద్ధతో స్పష్టంగా చెప్తే బావుండేది " అని నారాయణ రావు గారు కూడా అనడంలో న్యాయం వుందా ?

'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' లో నారాయణరావుగారు స్పష్టంగా గుణాత్మకమైన మార్పును విప్లవం అని వాడితే అలా వాడటం తప్పు అని ఇప్పటికీ మన విమర్శకులు వ్యాఖ్యానిస్తున్నారే ? స్పష్టత, శ్రద్ధా, ఎక్కడ లోపించిందీ నారాయణరావుగారికి ఇంకా అర్థం కావటం లేదా ? కాళిదాసు మేఘసందేశం రాశాడు. అందులో ఉన్నత కవిత్వం ఉందని విమర్శకులంతా ఒప్పుకుంటారు. కాని అది మహాకావ్యం కాదు. అందులో విప్రలంభ శృంగార మొక్కటే వర్ణితమయింది. రఘువంశం, కుమార సంభవం మహా కావ్యాలు.

తెలుగులో మహాకవి అనేమాట గొప్ప కవిత్వం రాసినవాడు అనే అర్థంలో వాడుతున్నారు. ఆ అర్థాన్నే మహా కావ్యానికి అన్వయించడం వల్ల ఈ గందరగోళం ప్రారంభం అయింది.

అవతలివాడు ఎంత స్పష్టంగా చెప్పినా తమకు ఇష్టమైన పద్ధతిలోనే అర్థం చేసుకుంటారు కొందరు.

### ప్రొ ॥ వెల్చేరు నారాయణ రావు :

ఆంధ్రజ్యోతి మార్చి 28 వ తేదీ సంచికలో చేరా ఉత్తరం చదివాను. నగ్నముని కొయ్యగుర్రానికి ఆయన రాసిన పీఠిక గురించి నేనన్న మాటలు – ఇంటర్వ్యూ సందర్భంలో వివరించలేకపోయాను. ఆ మాటలమీదా, ఆ ఇంటర్వ్యూలో అన్న ఇతర మాటల మీదా చేరా చేసిన వ్యాఖ్యలు ఆలోచించదగినవి. అంచేత ఈ ఉత్తరం. సాహిత్యంలో వ్యక్తుల స్థానాలు ప్రక్రియాపరమైన విమర్శ సిద్ధాంతానికి ఎక్కువ ప్రయోజనకరమైనవి కావు. నిజమే. కాని, సాహిత్యం సమాజపు గొంతుకని వినిపించే దేశం మనది. ఇలాంటి దేశాలలో 'కవి' అనే మాటకి అపారమైన గౌరవం వుంది. అందుకనే ఎవరు మహాకవి, ఎవరు మామూలు కవి అన్న ప్రశ్నకి సామాజికంగా చాలా విలువ వుంది. ఇది కేవలం సాహిత్య విమర్శకి సంబంధించిన విషయం కాదు. సమాజానికీ, సంస్కృతికీ, అభిప్రాయాలూ, ఆవేశాలూ ఈ సమాజంలో

పొందే ప్రాబల్యానికీ సంబంధించిన ప్రశ్న.

అన్ని సమాజాలలోనూ "కవిత్వం" వుంటుంది. కాని, కవిత్వపు ప్రభావమూ, పాత్రా అన్ని సమాజాలలోనూ ఒకలా వుండదు. మన సమాజంలో కవిత్వానికున్న సామాజిక ప్రభావం – ఉదాహరణకి యాంత్రిక నాగరికత బలపడిన పశ్చిమ దేశాలలో కన్నా – చాలా ఎక్కువ. మన సమాజపు గొంతుక మన కవుల పద్యాల్లో వినిపిస్తుంది. పాటల్లో వినిపిస్తుంది. రచయితల నవలల్లో వినిపిస్తుంది. పశ్చిమ దేశాల సమాజపు గొంతుక పత్రికా సంపాదకీయాల లోనూ, సమాచారాన్ని విశ్లేషించే మేధావుల పుస్తకాల్లోనూ ఎక్కువగా వినిపిస్తుంది.

మన సమాజపు గొంతుక కవిత్వం ద్వారా వినిపిస్తోంది కాబట్టి ఆ గొంతుకకి ప్రాతినిధ్యం వహించే కవి అనే వ్యక్తికి ఈ సమాజంలో అంత పేరు. సరిగ్గా ఆ కారణంవల్లనే ఎవరు మహాకవి అన్న ప్రశ్న గురించి అంతగగ్గోలు.

శ్రీ శ్రీ చచ్చిపోయిన తరవాత స్థితిని – ఒక పెద్ద ఉద్యోగానికి ఖాళీ ఏర్పడ్డ స్థితిగా నేను అభివర్ణించింది అందుకే. ఈ ఉద్యోగానికి ఎగబాకడానికి కవులనేకులు ప్రయత్నిస్తూండడమూ, వాళ్లలో కొందరు తాము శ్రీ శ్రీ కన్నా గొప్పవారమని చెప్పుకోవడమూ, లేదా శ్రీ శ్రీ నిజంగా అంత గొప్పవాడు కాడని అనడమూ వీటి మీద చర్చలూ, వివాదాలూ – ఇవి శుద్ధంగా సాహిత్య విమర్శ పరిధిలోకి రావు. నిజమే, కాని, సాహిత్య సామాజికతలో (సోషియాలజీ ఆఫ్ లిటరేచర్) ఇవి చాలా ప్రధానమైన అంశాలు. సాహిత్యాన్నీ, దాని సామాజిక స్థితినీ పరిశీలిస్తున్న విమర్శకులెవరూ వీటిని గమనించకుండా వుండలేరు.

తెలుగు సమాజంలో మహాకవి అనే పేరు బలీయమైన ప్రతీక కాబట్టే – నగ్నముని కొయ్యగుర్రానికి చేరా రాసిన పీఠికలో అది ఆధునిక మహాకావ్యం అన్నమాట అంత ఉద్వేగకరమైన (అపార్థాలతో కూడిన) చర్చలకి దారి తీసింది.

చేరా – కొయ్యగుర్రం 'ఆధునిక మహాకావ్యం' అని అన్నప్పుడు ఆయన చేసినది రూప విభజన మాత్రమే అని నాకు స్పష్టంగానే బోధపడింది. అయినా చేరా కొయ్యగుర్రం పీఠిక మరి కొంచెం శ్రద్ధతో స్పష్టంగా రాస్తే బాగుండేది అని నేను అనడానికి కారణాలు వివరిస్తాను.

ముందు స్పష్టతని గురించి : ' మహా' అనే మాటకి రెండు అర్థాలు వున్నాయి. ఒకటి 'గొప్ప' అని, రెండోది 'పెద్ద' అని. ఒకటి తాహతుని నిర్ణయించేది, రెండోది సైజుని నిర్ణయించేది. మహాభవనం, మహానగరం అనే మాటల్లో 'మహా' సైజుని గురించి చెప్పేది. ఒక చిన్న నగరం ఆ వూళ్ళో ఎందరు గొప్పవాళ్ళున్నా, అది ఎంత డబ్బున్న నగరమైనా అది గొప్పనగరం అవుతుందేమో గాని, మహానగరంకాదు. అలాగే ఒక చిన్నమేడ- ఎంత విలువైనదైనా మహా భవనం కాదు. కాని మహారాజు, మహాకవి అనే మాటల్లో ' మహా' గొప్పతనాన్ని చేప్పే మాట. ఒకాయన రాజనవచ్చు. కాని మహారాజు కాకపోవచ్చు. ఒకరు కవి అనొచ్చు కాని మహాకవి కాకపోవచ్చు.

చేరా ప్రతిపాదన ప్రకారం మహాకావ్యం అనే మాట ఒకరకమైన లక్షణాల సంపుటి వున్న కావ్యం, ఆ లక్షణాలలో సైజు కూడా ఒక లక్షణం. ఇది తాహతుని నిర్ణయించే పేరుకాదు, ఒక ప్రక్రియని సూచించే పేరు.

లోకంలో మహా కేవలం ఒక సైజునో, ప్రక్రియనో సూచించే అర్థంగా ప్రచురంగా లేదు. మహాకావ్యం అనే మాటని ముక్తకం కన్నా భిన్నమైన అర్థంలో అనేక అధ్యాయాలున్న సర్గబంధంగా నిర్వచిస్తూ అందులో అష్టాదశ వర్ణనలు వుంటాయని మొట్టమొదట చెప్పిన వాడు దండి. ఈ రకమైన ప్రక్రియా విభజన ఆధునిక తెలుగు వచన పద్యాల్లో అవసరమనీ, పూర్వపు ఆలంకారికుల పద్ధతిని అనుసరిస్తూ తాను ఆధునిక వచన పద్యాల్లో కూడా మహాకావ్య/ మినీ కావ్య విభజన చేస్తున్నా ననీ చేరా చెప్పివుంటే స్పష్టతకి అపారంగా ఉపకరించేది. అయితే, చేరా దండి పేరుగాని, పూర్వ ఆలంకారికుల ప్రసక్తిగాని ఎక్కడా తన పీఠకలో తీసుకురాలేదు. (ఆ ప్రసక్తి చేరా వుత్తరంలో మాత్రం స్పష్టంగా వుంది).

పోనీ ఇది పెద్ద లోటు కాదనుకుందాం. తెలుగులో కొయ్యగుర్రానికి ముందు మహా–అంటే–పెద్ద వచన పద్యాలు కనీసం కొన్నైనా వున్నాయి. మహాకావ్యానికి చేరా ఇచ్చిన నిర్వచనం ప్రకారమే చూసినా "మహాకావ్యం" అయి తీరవలసినది శ్రీ శ్రీ రాసిన "కవితా ! ఓ కవితా" వుంది. కుందుర్తి "నగరంలో వాన" వుంది. ఇవి కాక ఇంకా కొన్ని వుండొచ్చు. ఇవేవీ తన నిర్వచనం ప్రకారం మహాకావ్యాలు కావనైనా చేరా విశ్లేషించి చెప్పాలి. లేకపోతే, కొయ్యగుర్రానికి ముందు ఆధునిక మహాకావ్యాలు కొన్ని వున్నాయనీ, కొయ్యగుర్రమే మొదటిది కాదనీ చెప్పాలి. చేరా ఈ రెండు పనులూ చేయ్యలేదు.

ఇక చేరా పీఠికలో శ్రద్ధ తక్కువ అవడం గురించి : చేరా ఆధునిక మహాకావ్యానికి ఇచ్చిన "నిర్వచనం" చాలా గజిబిజిగా వుంది.

"ఒక ప్రధాన వస్తువుతో, ఒక తాత్త్విక చింతనతో, సందేశంతో, అనేక భావాలతో, మూడ్సుతో, కథ లేకుండా 'అర్బేనిటీ' అనే లక్షణం కలిగి వుండి తగినంత విస్తారంగా వున్న దీర్ఘకవితను ఆధునిక మహాకావ్యం అంటున్నాను."

ఇది ఆయన నిర్వచనం. ఇందులో భావాలకీ, మూడ్సుకీ తేడా నాకు తెలియడం లేదు. అర్బేనిటీ అంటే – పెద్ద మనిషితరహా, సౌజన్యం, నాగరిక స్వభావం – అని అర్థాలు. ఇవి కవిత్వ గుణాలు అయి, ఇవి లేకపోతే, మహాకావ్యానికీ, ప్రక్రియాపరంగానైనా వచ్చేలోటు ఏమిటో తెలియడంలేదు. ఇకపోతే, ఆధునిక వచన పద్యంలో కథ లేకుండా పోయింది. నిజమే. కాని కథ లేకపోవడం మహాకావ్య లక్షణం అవడం యాదృచ్ఛికమా, ఆవశ్యకమా? అదీ తెలియదు.

ఈ నిర్వచనం వర్ణనాత్మకం (డిస్క్రిప్టివ్) అయితే, ఈ చివరి ప్రశ్న–కథని గురించినది ఉత్పన్న మయేదికాదు. కాని ఈ నిర్వచనపు 'గొంతుక' వర్ణనాత్మకంగా లేదు. "మన పాత అలంకార శాస్త్రాలలో లాగా, నిర్ణయాత్మకంగా (ప్రిస్క్రిప్టివ్)గా వుంది ! ఇది ఇలా వుండగా చేరా నిర్వచనం ప్రకారం మహాకావ్యానికి ఒక తాత్త్విక చింతనా, సందేశమూ కావాలి. వాటితోపాటు తగినంత పొడుగు కావాలి.

చేరా కొంచెం శ్రద్ధగా చూసివుంటే కొయ్యగుర్రంలో పొడుగు, బలవంతాన సాగదీసిన పొడుగేకాని, పద్యానికి అవసరమైన పొడుగు కాదు అని తెలిసేది. అందులో కొన్ని భాగాలు కుదించి పద్యం తిరగరాస్తే ఇంకా మంచి పద్యం అయేది. మరి శ్రీ శ్రీ "ఒకవితా" లో ఒక్క అక్షరం తీసెయ్యడానికి వీలులేదు. అయితే ఈ విషయం ప్రస్తుతానికి నా అభిప్రాయంగానే సూచించాలి. వివరంగా దీనిని ప్రదర్శించడానికి ఈ పత్రికలో చోటుచాలదు.

ఇకపోతే కొయ్యగుర్రంలో తాత్త్విక చింతన, సందేశం–వీటి విషయం. కొయ్యగుర్రంలో మార్క్సిస్టు దృక్పథమూ, విప్లవకర సందేశమూ వున్నాయని చూపించడం ద్వారా చేరా అందులో తాత్త్విక చింతనా సందేశమూ వున్నాయని ప్రతిపాదించారు.

ఈ విషయమై చాలా వాదాలు జరిగాయని విన్నాను. అంచేత ఎక్కువ

చర్చించను. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే కొయ్యగుఱ్ఱం తాత్త్వికంగా దిగంబర కవిత్వపు పొడిగింపేననీ, అందులో మార్క్సిస్టు తత్త్వం కాని, విప్లవ సందేశం కాని లేవనీ తెలుస్తుంది.

కొయ్యగుఱ్ఱం వస్తువు ప్రకృతికీ, అతి నాగరికతా ప్రభావం వల్ల ప్రకృతికి దూరమై పోయిన మనిషికీ మధ్య వున్న సంఘర్షణ. ఈ వస్తువు ఈ పద్యంలో ప్రకృతికీ, సంస్కృతికీ (నేచర్‌కీ, కల్చర్‌కీ) సంఘర్షణగా చిత్రితమయింది. ఇక్కడ సంస్కృతి అంటే, ప్రకృతి సహజంగా మనిషిలో కలగనివి అన్నీని. అంటే మనుష్యులు సమాజగతంగా కల్పించుకున్నవన్నీని. భాష, కవిత్వం, వేదాంతం, నీతులు, సౌందర్యం, రాజకీయాలు, ప్రభుత్వం – ఇవన్నీ సంస్కృతిలో భాగాలు. ఇవన్నీ అసహజంగా, "అబద్ధం"గా వున్నాయని ఈ పద్యం చెప్తుంది. సత్యం కేవలం మృత్యువే. అది ప్రకృతి కాబట్టి.

అబద్ధానికీ, దిగంబరమైన నిజానికీ మధ్య వున్న సంఘర్షణని వ్యక్తం చేసే ప్రతీక కొయ్యగుఱ్ఱం. ఈ సంఘర్షణ రెండు వర్గాల మధ్య సంఘర్షణ కాదు. లంచగొండి ప్రభుత్వాలకీ, పేద ప్రజలకీ మధ్య సంఘర్షణ కాదు. అయినా ఈ సంఘర్షణని ప్రతీకగా ఈ పద్యం వాడుకుంటుంది. వీటితో పాటు భాషకీ–నిశ్శబ్దానికీ వున్న సంఘర్షణని కూడా వాడుకుంటుంది. భాష సంస్కృతిలో భాగం కాబట్టి అసహజం. కాని భాష వాడనిదే పద్యం లేదు. నిశ్శబ్దం ప్రకృతి. కాని అందులో పద్యం పుట్టదు. భాష అబద్ధం కాని అది లేందే పద్యం లేదు. అందుకే ప్రతి కవీ సృష్టికర్తా, హంతకుడూ కూడా. సత్యప్రవక్తా, అబద్ధాలకోరూ కూడా.

ప్రకృతికీ – సంస్కృతికీ మధ్య వున్న సంఘర్షణ అసలు లేకపోతే మనిషి లేడు. అది ఎక్కువ అయిపోయినా మనిషి వుండడు. ఇది ఈ కావ్యంలో తాత్త్విక చింతన. ఇప్పుడు మనిషికి వున్న సమస్యల కన్నిటికీ మూలకారణం మనిషి తన ప్రకృతికి దూరం అయిపోవడం ఒక్కటే. అంచేత ప్రకృతి తల్లి పొట్టలోకి మనిషి మళ్ళీ వెళ్ళిపోగలిగితే అన్ని సమస్యలూ పరిష్కారమవుతాయనీ, అన్ని సత్యాలూ తెలుస్తాయనీ ఈ కావ్యం చెప్తుంది. ఇదీ ఈ కావ్యపు పరమార్థం. ఈ కవిత్వంలో సందేశం వుండదు. ఇది రాజకీయ కవిత్వం కాదు కాబట్టి ఈ "అమాయిక" సిద్ధాంతాన్ని మంచి కవిత్వంగా చెప్పగలగడం నగ్నముని సాధించిన విశేషం.

ఈ విషయం గుర్తించి , ఈ అమాయిక తత్త్వానికీ, దిగంబర పరమార్థానికీ ఒక "మహానుభూతి" (ఇది చేరా మాటే) కలిగించగల గాఢత వుందని చేరా వాదించగిలిగితే అది వేరే విషయం అయి వుండేది.

పోతే కొయ్యగుఱ్రంలో అనేక భావాలూ/మూడ్సూ వున్నాయి. (ఈ రెండింటికీ తేడా లేదనుకుంటున్నాను) సమాప్తంగా చెప్పాలంటే, చేరా నిర్వచనం నాకు అర్థమయినంతవరకూ వర్తింప చేసి చూసినా, "కొయ్యగుఱ్రం"లో విస్తీర్ణత పద్యానికి అవసరమైనదికాదు, సాగదియ్యడం వల్ల వొచ్చింది. ఇందులో తాత్త్విక చింతన సందేశమూ చేరా అనుకున్న లాంటివి కావు. ఇందులో తాత్త్విక చింతన, దిగంబర తాత్త్విక చింతన ఇలాంటి పద్యాలకి "సందేశం" అంటూ ఏదీ వుండదు (అయితే ఇలాంటి తాత్త్విక పరమార్థంతో మంచి కవిత్వం అవదనీ నేనడం లేదు. ఏదో ఒక సందేశం లేకపోతే అది కవిత్వం కాదనీ నేనడం లేదు. చేరా నిర్వచనం ప్రకారం చూసినా ఈ కావ్యం మహాకావ్యం కావడం లేదని అంటున్నానంతే)

ఇంతకీ ఆధునిక వచన కవిత్వంలో మహాకావ్య/మినీ కావ్య విభజన ఏ రకంగా ప్రయోజనకరం అనే ప్రశ్న వుంది. చేరా చేసిన విభజన నాకు సరిగ్గానే అర్థమయిందని చెప్పడానికీ, ఆ విభజన ప్రకారం కూడా కొయ్యగుఱ్రం మహాకావ్యం అనే వర్గంలో చేరుతున్నదన్న విషయం మీద మరి కొంత స్పష్టత, శ్రద్ధ అవసరమని చెప్పడానికీ ఈ వివరణ రాశాను కాని, నిజానికి ఆధునిక కావ్య విమర్శలో ఈ విభజన వల్ల ఏ ప్రయోజనమూ లేదు.

అయితే పీఠికవల్లా, దీనిమీద చర్చవల్లా రెండు లాభాలు కలిగాయి. ఆ రెండు లాభాలూ - విచిత్రంగా - రెండు పొరపాట్ల వల్ల కలిగాయి. ఆ పొరపాట్లేమిటంటే, ఒకటి - మహాకావ్యం అనే మాటని పాఠకులు పొరపాటుగా అర్థం చేసుకుని, చేరా నగ్నమునిని మహాకవిని చేస్తున్నాడని అనుకున్నారు. రెండు- కొయ్యగుఱ్రం దుష్ట రాజకీయ వ్యవస్థకి సంకేతమనీ, దాన్ని తగలబెట్టెయ్యమనీ ఈ కావ్యపు సందేశమనీ చేరా పొరపాటుగా వ్యాఖ్యానించారు.

వెరసి ఈ రెండు పొరపాట్ల వల్లా మన సాహిత్య సమాజం గురించి రెండు మంచి సంగతులు తెలిశాయి. ఒకటి: మహాకవి అనే పేరుకి ఈ సమాజంలో కవిత్వాన్ని మించిన ప్రతీకాత్మక బలం వుంది. ఆ పేరు ఎవరికి పడితే వాళ్ళకి వర్తింప చెయ్యడానికి తెలుగు పాఠకులు ఒప్పుకోరు. రెండు:

ప్రజల సమస్యల గురించీ, ప్రభుత్వాల దుర్మార్గాలను గురించీ, విప్లవ సందేశాలతో రాసిన పుస్తకాల పట్ల పాఠకుల్లో ఆదరణ వుంది. అందుకే ఆ సందేశం నిజంగా ఇవ్వని కవులు కూడా తమ రచనల్లో ఆ సందేశం వుందని చెప్పడానికి తాపత్రయపడతారు.

ఈ రెండు లాభాలూ పరోక్షంగానైనా కలిగించిన కొయ్యగుర్రం పీఠికను ఆధునిక తెలుగు సాహిత్యంలో అందరం గుర్తుంచుకోవాలి.

## ప్రొ॥ చేకూరి రామారావు :

9-5-86 ఆంధ్రజ్యోతి వారపత్రికలో వెల్చేరు నారాయణరావు గారు (సంక్షిప్తత కోసం ఇక నుంచి నారా అని వ్యవహరిస్తాను) మరికొన్ని ఆసక్తికరమైన అభిప్రాయాలు వెల్లడించారు. వాటిల్లో ముఖ్యమైన వాటి గురించి నా అభిప్రాయాలు స్థూలంగా ప్రకటిస్తాను. శ్రీశ్రీ తరవాత స్థానం గురించి అంత విశేషంగా మాట్లాట్టానికేమీ లేదని మానేస్తున్నాను. అదీకాక ఆ విషయం గురించి ఎక్కువ భాగం ఊహల మీద ఆధార పడాలి.

కొయ్యగుర్రం పీఠికలో చేరా స్పష్టంగానూ శ్రద్ధగానూ చెప్పకపోవటం వల్లనే "మహాకావ్యం" అనే ప్రయోగాన్ని చాలా మంది (ఈ చాలా మందిలో నారా లేరని నేనెరుగుదును) అపార్థం చేసుకున్నారని నారాగారు ఈ సంచికలో పునరుద్ఘాటించారు.

"లోకంలో 'మహా' కేవలం ఒక సైజునో, ప్రక్రియనో సూచించే అర్థంగా ప్రచురంగా లేదు." అందువల్ల ఆ మాట ప్రయోగిస్తున్నప్పుడు ఆ అర్థంలో వాడుతున్నానని స్పష్టంగా చెప్పాలని నారా తాత్పర్యం. ఇంతేకాదు ఇంకా స్పష్టంగా పూర్వ అలంకారికులు వాడిన 'మహాకావ్యం అనే మాటను అదే అర్థంలో ఆధునిక వచన కవిత్వానికి పట్టిస్తున్నాను అని చెప్పాలని నారా గారి అభిప్రాయం. ఉహూ అది కూడా చాలదు. దండి ప్రసక్తి కూడా తీసుకురావాలి. స్పష్టత సాధించాలంటే ఇవన్నీ సాధించి ఉండాల్సింది అని నారాగారు కఠినమైన ఆంక్షలే పెట్టారు.

ఈ చర్చలోకి దిగబోయే ముందు అందరికీ మనవి చేసేదేమంటే - కొయ్యగుర్రం పీఠిక రాస్తున్నప్పుడు నేనేదో సాహిత్య విమర్శ చేస్తున్నానన్న

స్పృహతో రాయలేదు. ఒక నచ్చిన కవితను చదవటంలో పాఠకుడిగా నా అనుభవాన్ని నలుగురితో పంచుకోవటమే నేనుద్దేశించింది. ఆ సందర్భంలో నేను మామూలుగా చదివిన ఖండికలకన్నా భిన్నమైన అనుభవాన్ని పొందటం వల్ల దాన్ని విశ్లేషించే ప్రయత్నంలో మహాకావ్య ప్రసక్తి వచ్చింది. ఆ పీఠికను ఒక పరిశోధక వ్యాసంగా ఉద్దేశించ లేదు. అందువల్ల ప్రాచీనాలంకారికుల పేర్లను తీసుకురాలేదు. అయితే ఆ స్ఫూర్తి లేకపోలేదు. చూడండి. "ప్రాచీన మహాకావ్యాలకు కొన్ని లక్షణాలున్నై. రసపోషణాదులు కాక అవసరమైన ఇతివృత్తం, వర్ణనలు, అలంకారాలు, సర్గబంధం ఇత్యాదులు చాలా వున్నై". ఇందులో ప్రాచీనాలంకారికుల స్ఫురణ లేదూ! ప్రాచీన మహాకావ్యలక్షణాలు ప్రాచీనులు చెప్పినవనే ఉద్దేశం గాని, నేను చెప్పినవని కాదు. 'ఉన్నయ్యి' అంటే నా కంటే ముందే ఉన్నయ్యని.

'మహాకావ్య' శబ్దాన్ని ప్రక్రియా పరంగా ఉపయోగించానని గుర్తిస్తూనే నారా 'సైజు' అనే లక్షణాన్ని అవసరానికి మించి ముందుకు తోస్తున్నారు. సైజు అనేది ఒక లక్షణమే. కాని అది ఆటోమేటిక్ లక్షణం. ఒక నవల రెండు పేజీల్లో రాయలేరు. సుమారు 100 పేజీలు కావాల్సుంటుంది అనుకుందాం. అక్కడ సైజు ప్రసక్తి ఉంటుంది. మహాకావ్యంలో సైజు అట్లాంటిదే. కథాగమనంలో వైవిధ్యం ద్వారా కావ్యానుభవాన్ని కలిగించాలి కాబట్టి సహజంగా కావ్య విస్తీర్ణత పెరుగుతుంది. సహజంగా సైజులో పెద్దది కూడా అవుతుంది." అని ఆ పీఠికలో అనటంలో ఉద్దేశం అదే.

సహజంగా అంటే "రచయిత ప్లాన్ చెయ్యకుండానే ఆటోమేటిగ్గా" అని అర్థం. మహాకావ్యం అంటే కేవలం సైజు పెరగడం మాత్రమే కాదని స్పష్టంగానే చెప్పాను. ఉదాహరణకి ఆ పీఠికలోనే "కావ్య ఖండికల్లో ఒకే వస్తువు ఒకే భావం ఉంటై. ఒక ఖండికలో భిన్న భావాలను చెప్పటం కుదరదు. అంటే మహాకావ్యం కావాలి. మహాకావ్యానికి విస్తీర్ణతే ప్రధానం కాదు కాని అవసరమైన ఒక లక్షణం. పెద్ద పాయింటులో అచ్చెయ్యటం వల్లనో పాదాలుగా విరవటం వల్లనో కవిత్వం కానట్లే విస్తీర్ణత వల్ల ఏదీ మహాకావ్యం కాలేదు. ఈ పైన ఉటంకించిన భాగంలో 'వైవిధ్యాన్ని' మహాకావ్యానికి ప్రధాన లక్షణంగా ఉద్దేశించానని స్పష్టం కావటం లేదా?

నారా ఆ వ్యాసంలో నామీద ఇంకా మరికొన్ని బాధ్యతలుంచారు.

తెలుగులో కొయ్యగుర్రానికి ముందు మహా-అంటే పెద్ద వచన పద్యాలు కనీసం కొన్నైనా వున్నాయి. మహాకావ్యానికి చేరా ఇచ్చిన నిర్వచనం ప్రకారమే చూసినా మహాకావ్యం అయి తీరవలసినది శ్రీశ్రీ రాసిన 'కవితా! ఓ కవితా!' ఉంది. కుందుర్తి 'నగరంలో వాన' ఉంది..... ఇవి కాక ఇంకా కొన్ని ఉండొచ్చు ఇవేవీ తన నిర్వచనం ప్రకారం మహాకావ్యాలు కావనైనా చేరా విశ్లేషించి చెప్పాలి. లేకపోతే కొయ్యగుర్రానికి వున్నాయని, కొయ్యగుర్రమే మొదటిది కాదనీ చెప్పాలి. చేరా ఈ రెండు పనులూ చెయ్యలేదు" అని ఆరోపించారు. ఈ రెండూ నేనెందుకు చెయ్యాలట! మహాకావ్యం అనే మాట ఉపయోగించావు కాబట్టి అని అంటారా? నేను రాసింది ఒక పుస్తకానికి పీఠిక. నా కావ్య పఠనానుభవాన్ని పాఠకులతో పంచుకోవటం కోసం చేసిన ప్రయత్నం అది! అందుకోసం ఈ కఠిన నియమాలన్నీ పాటించాలా! 'నారా' అడిగినవన్నీ చెయ్యాలా?

నారా పేర్కొన్న పై రెండే కాక శివసాగర్ వీవా లా శాంటియాగో! శివారెడ్డి ఆసుపత్రి గీతం. ఇంకా ఇట్లాంటి వాటిని మరికొందరు ప్రతిపాదించారు. ఇవన్నీ మహాకావ్యాలు అవునో కాదో టేపులూ, తూనికరాళ్ళూ, కొలబద్దలు రెడీగా పెట్టుక్కూర్చోవాలా నేను? అది నా పని కాదని నారా గారికి ఇతర పాఠక లోకానికి మనవి చేసుకుంటున్నాను. ఒకరి పుస్తకానికి రాస్తున్న పీఠికలో ఇతరుల కావ్యాల తారతమ్యం తప్పనిసరిగా చూపాల్సిన అవసరం నాకు లేదు. మహాకావ్యం అనేది పెద్ద వచన కావ్యం అనే దృష్టితో నేను వాడలేదు. పెద్ద వచన కావ్యాలు తక్కువేం లేవు. ఆధునిక మహాకావ్యాల సంగతి నేను మాట్లాడుతున్నది.

పద్యాలు రాసేబదులు ఛందస్సు లేకుండా రాయటాన్నే నేను ఆధునిక లక్షణంగా గుర్తించటం లేదు. వ్యక్తీకరణలో ఆధునికత ఉండాలి. నిజానికి 'కవితా, ఓ కవితా!' ఛందస్సులోనే ఉంది కాబట్టి దాన్ని గురించి చర్చ అనవసరం. అవసరం వచ్చింది కాబట్టి నిర్మొహమాటంగా చెపుతున్నాను. కుందుర్తి తన వ్యక్తీకరణకు ఛందస్సు అడ్డం రావటం వల్ల వదలలేదు. కుందుర్తి, ఇంకా ఆ మార్గంలో రాసిన చాలా మంది ఊరికే ఛందస్సును వదిలేశారంతే. ఛందస్సులో రాసినా వచ్చే నష్టం లేదు. భావ వ్యక్తీకరణలో అలంకార ప్రయోగంలో కుందుర్తి అచ్చమైన ప్రాచీనుడు. కాలం మారింది కాని కవితా

సామాగ్రి మారలేదని కుందుర్తి భావన. మామూలు వాక్యంలో పదక్రమ వ్యత్యయం చేసి అనుప్రాసలు కూర్చుకొని, కొన్ని రచనా సంబంధమైన తమాషాలు చేర్చటం వల్ల కుందుర్తి వచన కవితా రీతి తయారయింది. మిగతాదంతా ప్రాచీన కవితా సామాగ్రే. ఇంతమాత్రాన కుందుర్తిని చిన్న చూపు చూడకూడదు. 'ఛందస్సు వదిలెయ్యొచ్చు. ఏం కొంప మునిగిపోదు.' అని ప్రత్యక్షంగా చూపించటం తక్కువ కృషి కాదు. అయితే వచన కవిత్వం అక్కడితో ఆగలేదు. వ్యక్తీకరణలో కొత్తదనాన్ని సాధిస్తున్నది. సభారంజకత్వం కోసం చేసే అల్ప చమత్కారాల వారసత్వం నుంచి పదక్రమవ్యత్యయం, సంబోధనలు మొదలైన చిట్కాల వలయం నుంచి, ప్రాబంధిక సమాస బంధురత నుంచి బయటపడి సీరియస్ ధోరణిలో సాగుతున్నది. పరిణతి సాధిస్తున్నది. ఒక నాజూకుదనాన్ని, రిఫైన్మెంటును, సాధించుకుంటున్నది. దానికి ఒక పేరు పెట్టుకోవాల్సిన అవసరం కనిపించి 'అర్బేనిటీ' అనే మాట వాడాను. ఈ సారాంశాన్ని కొయ్యగొఱ్ఱం పీఠికలోనూ (పే. XII) సూచించాను. ఈ మాట సరిపడకపోతే ఇంకోమాట వాడుకోవచ్చు. నాకు మాట ముఖ్యం కాదు. దాని వెనకాల వున్న కాన్సెప్టులు ముఖ్యం.

కథ లేకుండా పోవటం గురించి : కథ లేకపోవటం మహాకావ్య లక్షణం అవడం యాదృచ్ఛికమా? ఆవశ్యకమా? అని అడుగుతున్నారు నారా. ఈ కాలం కవిత్వం నుంచి కథ వైదొలగింది. ఇక మళ్ళీ మహా కావ్య లక్షణంలో కథ లేకపోవటం గురించి ఎందుకు చెప్పాలో అని నారా ప్రశ్నల అసలు ఉద్దేశం. వచన కవిత్వంలో కూడా కథా కావ్యాలు రావాలని కుందుర్తి వాదించే వారు. అందుకనుగుణంగా కొందరు వచన కవిత్వంలో కథలు రాశారు (శీలా వీర్రాజు 'కొడిగట్టిన సూర్యుడు' ఒక ఉదాహరణ) సైజుని బట్టి వాటిని మహాకావ్యాలు అనుకొనే ప్రమాదం ఉంది. అందువల్ల ఆధునిక మహాకావ్యంలో కథారాహిత్యాన్ని ఒక లక్షణంగా ప్రవేశ పెట్టటం. ఇది ప్రిస్క్రిప్టివ్‌గా ఉందంటారు నారా. నేనట్లా అనుకోటం లేదు. ఇతర లక్షణాలు అస్తిత్వాన్ని చెపితే కథా రాహిత్యం నాస్తిత్వాన్ని చెపుతుంది. అంతే తేడా. అంత మాత్రాన్నే ఇది 'ప్రిస్క్రిప్టివ్' అయిపోదు.

ఇదే నిర్వచనంలో "అనేక భావాలతో, మూడ్స్‌తో" అనే ప్రయోగానికి అభ్యంతరం చెపుతూ "భావాలకు, మూడ్స్"కూ తనకు తేడా తెలియటం

లేదన్నారు. ఉన్నా లేకపోయినా చింతలేదు. 'నా రచనలో శ్రద్ధ తక్కువయింది. అందువల్ల అపోహలు వచ్చాయి' అని చెప్పటం కోసం ఇది తార్కాణంగా ఉపయోగిస్తున్నారు. దీనివల్ల వచ్చిన అపోహ ఏమీ లేదు. మహా అయితే పునరుక్తి అవుతుంది. ఇంతకీ కాస్త తేడా ఉందనుకొనే వాడాను. 'మూడ్' కేవలం మనస్తితిని మాత్రమే సూచిస్తుంది. భావం ఇంతకన్నా విశాలమైంది. 'అతని మూడ్ బాగా లేదు' అనే వాక్యం యీనాటి తెలుగులో 'అతని భావం బాగాలేదు' అన వాక్యానికి సమానం కాదు. సాహిత్య పరంగా భావం మూడ్‌కి ఇంకాస్త సన్నిహితమైంది. (పై వాక్యార్థాల్లో కన్నా) అయితే ప్రాచీన అలంకార శాస్త్రంలో భావం అనే మాట చాలా విస్తృతర్థాంలో ప్రయుక్తమయింది. మనస్థితి కారణంగా వ్యక్తమయ్యే శారీరక స్థితులకు కూడా భావం అనే వాడారు. స్తంభము, ప్రళయము, లోమాంచము, స్వేదము... మొదలైన సాత్విక భావాలు దేహస్తితి సూచకాలు. అందువల్ల స్పష్టత కోసం భావాలు, మూడ్స్ అని వాడబడింది. శ్రద్ధా రాహిత్యానికి దీన్ని ఉదాహరణగా తీసుకోనక్కర్లేదు.

నా శ్రద్ధాలోపానికి మరొక్క తార్కాణం చూపించారు నారా. 'కొయ్యగుర్రం'లో పొడుగు బలవంతాన సాగదీసిన పొడుగేనని నేను గుర్తించలేదన్నారు. అదే సందర్భంలో శ్రీశ్రీగారి 'ఓ కవితా!' గీతంలో ఒక్క అక్షరం తీసెయ్యడానికి వీల్లేదు" అన్నారు. ఈ రకమైన ప్రతిపాదనలలో గాని, పరిశ్రమలోగాని వ్యక్తిగతమైన రుచుల ప్రమేయం ఎక్కువ. ఇట్లాంటివి రుజువు కావటం కష్టం. అయినా ప్రయోగం కోసం నారా కొయ్యగుర్రాన్ని కుదించి తయారు చేస్తే అచ్చు వెయ్యటానికి ఆంధ్రజ్యోతి వారికి అభ్యంతరం ఉంటుందనుకోను. కొయ్యగుర్రాన్ని పూర్తిగా అచ్చేసిన ప్రజాతంత్ర, ఆంధ్రజ్యోతి కన్నా సైజులో చాలా చిన్నది.

ఇక కొయ్యగుర్రం సందేశం తాత్విక చింతన గురించి సరిగ్గా ఇక్కడే నిజంగా విభేదించడానికి బోలెడంత అవకాశం ఉంది. కొయ్యగుర్రం ఇచ్చే సందేశం అన్ మార్క్సిస్టు అని తొలిసారిగా వివాదం జరిగిన రోజుల్లోనే 'నూతన' పత్రికలో చేకూరి శ్రీనివాస విభేదించారు. కొయ్యగుర్రం తాత్వికంగా దిగంబర కవిత్వపు పొడిగింపేనని నారా అంటున్నారు. దిగంబర కవిగా ఎక్కువ రచనలు చేసిన నగ్నముని ఇతర రచనలలో దిగంబర కవితా మార్గావశేషాలు కొన్ని మిగిలి వుంటే ఉండొచ్చుకాని అంతమాత్రాన దిగంబర కవిత్వానికి పొడిగింపే

నటం అతి సాధారణీకరణం.

కొయ్యగుర్రంలో వర్గ సంఘర్షణ లేదు అంతమాత్రం చేత (నేననుకునే) సందేశం లేదంటున్నారు.

జరిగింది ప్రకృతి బీభత్సం. దీనికి ప్రభుత్వాలు ప్రత్యక్ష కారణాలు కాకపోవచ్చు. వ్యవస్థ కూడా ప్రత్యక్ష కారణం కాదు. అయితే జరగకుండా నిరోధించడానికి, జరిగిన తరువాత శవాల మీద వ్యాపారం జరగటానికి గాని ఈ రెంటి బాధ్యత ఉంది. "కొయ్యగుర్రం స్థబ్దతకీ మూర్ఖతకీ అహంకారానికీ అసమర్థ పరిపాలనకీ ప్రతీక" అనే మార్క్సిస్టుగా కనిపించేది చివర ఒక చోట ఉంది.... "పాతరాతి యుగం పనిముట్టు పట్టుకుని చరిత్ర చీకటి కోణాల గుహల్లోకి వెళ్ళిపోతాను" అంటాడు. అయితే మార్క్సిస్టు కొలబద్దలకు సరిపోయే సందేశం కొయ్యగుర్రంలో ఉందనలేదు నేను. అసమర్థ పాలనం అంతం చెయ్యాలనేంత వరకే ఆ సందేశం. మార్గాల విషయంలో విసుగెత్తిన కన్ఫ్యూషన్ చివరి ఖండికలో కనిపిస్తుంది.

విస్తీర్ణతను మించిన ప్రక్రియా భేదాన్నుద్దేశించి మహాకావ్యం అనే మాట వాడాను. విస్తీర్ణతే పరమావధి అయితే ఈ విభజనకు ప్రయోజనం లేకపోవచ్చు. ఒకవేళ నేను చెప్పిన ఒకటి, అరా లక్షణాలలో లోపం వున్నా ఈ విభజన ప్రయోజన రహితం కాదు. నేను గుర్తించిన లక్షణాలను ఇంతకన్నా పటిష్టంగా చెప్పాల్సిన అవసరం ఉంటే ఉండొచ్చు. అంతమాత్రం చేత కొయ్యగుర్రం ఒట్టి 'లాంగ్‌పోయం' అనడం రిడక్షనిజం.

నారా తమ వ్యాసం చివర కొయ్యగుఱ్రం పీఠికకు ఒక "పుత్రచేతి ప్రశంస"ను దయ చేశారు. అందులో గడసరిదనాన్ని మెచ్చుకుంటున్నాను. గడుసైనవన్నీ నిజాలు కానక్కర్లేదు కదా!



# కొయ్యగుర్రానికి కోటిదండాలు!

## శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

సృష్టి ప్రచురణగా వెలువడిన వినూత్న కావ్యసృష్టి **కొయ్యగుర్రం** ఒక విశిష్ట రచన. ఇటీవల అసంఖ్యాకంగా వస్తున్న వచన కవితా సంకలనాలన్నింటికీ భిన్నంగా వుండే ఈ కావ్యం ఒక లాంగ్ పోయమ్. కొయ్యగుర్రంలో రాజసం, పొగరు, విగరు అట్టమీద వ్యక్తమవు తున్నప్పటికి అది హృదయంగల హయం మాత్రం కాదని వేగంగా కూడూగూడూ గుడ్డా దొరికే సోషలిస్టు హయాంలోకి తీసుకెళ్ళలేని అయోమయాశ్వమనీ పాఠకులు గుర్తించేలా నగ్నముని చిత్రిక పట్టిన రచన. 1977 నవంబర్ 19న సాగరమెత్తిన జలఖడ్గానికి తెగిన అసంఖ్యాక దీన మానవుల తలలకి ఈ కొయ్యగుర్రం నగ్నముని అర్పించిన జలతర్పణం.

నేటి యువతరంలో ఆధునిక కవుల్లో తిరుగులేని ప్రతిభా సామర్థ్యాలు కల ఉక్కుపిడుగు నగ్నముని. సమయజ్ఞత, సందర్భశుద్ధి, ఆవేదన, ఆవేశమూ అన్నీ సమపాళ్ళలో జీర్ణించుకున్న వ్యక్తిత్వం గల నగ్నమునికి, అతని రచనలకి విరోధులు హెచ్చుగానే వుంటారు. నగ్నమునికి ఎదురయ్యే వ్యతిరేకత అతనిని జీర్ణం చేసుకోవటం అంత సులభం కాకపోవటం వల్లనే. అతనిలోని కవి నిరంతరం ప్రజ్వలిస్తున్న ఇనబింబ సమానుడు. అతనిలోని రెచ్చగొట్టే స్వభావం అతని హైపర్ ఎనర్జీకి గుర్తు. అయితే నగ్నముని లోపాల్లేని కవి మాత్రం కాడు. ఆ మాటకొస్తే ఎవరూ కారు. అతను ప్రజాకవిగా చలామణి కావాలని ప్రయత్నించాడనే అపవాదు అర్థరహితం. ప్రజలకు నగ్నముని కావాలా అక్కర్లేదా అనే విషయం ప్రజలే తేల్చుకుంటారు.

చేకూరి రామారావుగారు రాసిన పరిచయ వ్యాసం వలన నగ్నమునికి విరోధులు రెండింతలయ్యారు. వేగుంట మోహనప్రసాద్‌గారు రాసిన

'ఇంటీరియర్ డయలాగ్' వల్ల కొంతమంది నుంచి 'విలోమ వేషాలతో పాతరాతియుగం పనిముట్టు పట్టుకొని ఇస్మాయిల్, వేగుంటలతో బయలుదేరిన నగ్నముని ఎక్కడికి చేరతాడో అంతు పట్టని విషయం' అనే కితాబును పొందినప్పటికీ ఆధునిక తెలుగు సాహిత్య ప్రపంచంలో నగ్నముని ఎక్కినన్ని మెట్లు ఏ యితర దిగంబర కవీ ఎక్క లేదు. విప్లవ కవులు ఎక్కా జాలరు. నగ్నముని నోరు మంచిది కాదు. అంతమాత్రం చేత అతని కలానికి యిన్ఫీరియారిటీ కాంప్లెక్స్ అంటగట్టటం అనౌచిత్యం అనిపించుకుంటుంది. మార్క్సిజం, మార్క్సిస్టు వివేచన ఒక సంప్రదాయ మనుకంటే ఆ సంప్రదాయంలో అతను రొడ్డకొట్టు కవిగా జీవించటం యిష్టం లేక బయటకు వచ్చాడు కాని. ప్రజల కవి అన్పించుకుందామనే ఆశతో కాదు. కవిత్వం తన్ను తాను వెతుక్కుంటుంది (ప్రజల్లో, జీవితంలో). నగ్నమునికి ఏ యితర కవులూ ఎంత పొడుగో, పొట్టో లావో, సన్నమో కూడా తెలుసు. ఎవరెవరికి కాలదోషం పట్టిందో కూడా తెలుసు. అయితే అప్పుడప్పుడు అతను బాలకవిగా అవి బయటపెట్టేస్తుంటాడు.

ఒక కరపత్రంలో నగ్నముని గురించీ, నగ్నముని కొయ్యగుర్రం గురించీ – (ఏ కవిగానీ, ఏ రచయితగాని, మేధావి గానీ, సామాన్య పాఠకుడుగానీ, కొయ్యగొర్రం చదివితే ఆనాటి సముద్రుని బీభత్సంగానీ, దాని ప్రభావంగా యేర్పడ్డ శోకమయ వాతావరణ చిత్రణగానీ, ప్రభుత్వపు అసమర్థత నిర్లక్ష్యతగానీ, అగుపించదు) అని అనటం భావ్యం కాదు. అసలు కావ్యానికి ప్రాతిపదికే ప్రభుత్వం అసమర్థత, అలక్ష్యం. కావ్యానికి టైటిల్ కూడా అందులోంచే వచ్చింది. ఈ కావ్యం గురించి వ్యతిరేకించే వారు ఇది ఆకాశవాణిలో ప్రసారమైనప్పుడుగానీ, 'ప్రజాతంత్ర'లో అచ్చయినపుడుగానీ ఊరుకుని పుస్తకరూపం ధరించగానే విరుచుకు పడనేల? ఇది ఏ విశ్వవిద్యాలయాల్లోనో, ఉన్నత విద్యాభ్యాసం చేసే విద్యార్థులకు పాఠ్యాంశంగా పెట్టదగిన ఆధునిక కావ్యం. చేకూరి రామారావుగారు రాసిన సుదీర్ఘమైన పీఠిక మహాకావ్యం ఔనా కాదా అన్న ప్రసక్తి వదిలేస్తే, నగ్నమునికీ కావ్యానికీ గొప్ప ప్రవేశికగా చదివేవారికి వస్తువుని కరతలా మలకం చేస్తుంది. నగ్నమునిని ప్రొ ఎస్టాబ్లిష్‌మెంట్ కవని ఎవరూ అనలేరు, అతని వ్యక్తిగత జీవితం ఎంత ధ్వంసమైందో తెలిసిన వారు. అతని గురించి ఇస్మాయిల్‌గారు 'వైర్' (Weir)

అనే గేయం ఎందుకు రాశారో అర్థం చేసుకున్నప్పుడు నగ్నమునిని బండరాయిగా అభినందించక తప్పదు.

ఈ కావ్యానికి ఊపిరి నగ్నమునే. 1977 నవంబర్ 19వ తేదీ కాదు. ఈ కావ్యంలో సందేశం కూడా అంతగహన దూరమేమీ కాదు. కొయ్యగుర్రాన్ని తగలబెట్టండి వెధవాయిల్లారా అంటున్నాడు కవి. కవిలో వున్న నిజమైన మానవుడు నిద్రలేచి, తన చేతకానితనానికి తను సిగ్గుపడ్డం, అవమానపడ్డం, బాధపడ్డం ఈ కావ్యంలో ఉంది. ఇది నిరాశావాదం కాదు. పిడక అంటుకునే ముందొచ్చే పొగ. నిజానికి ఈ కావ్యాన్ని చేకూరివారు తమ ప్రవేశికలో సుదీర్ఘంగా సమీక్షించారు. ఈ రచనలో నగ్నముని ఆలోచనా పరిధి విస్తరించి తాత్వికస్థాయికి చేరడాన్ని మనం కళ్లారా చూస్తాము.

ఒక మహా జలప్రళయం విజృంభించినపుడు అందులో మానవ వైఫల్యానికి అవకాశం ఉండకపోదు. బ్యూరోక్రసీ ఫెయిల్ కావడం గురించి ఇంత సీరియస్‌గా కావ్యం రాయాలా అనే అనుమానం కలగవచ్చు. ఇది కేవలం ఇప్పటి వ్యవస్థలో బ్యూరోక్రసీ ఫెయిల్ కావటం గురించి మాత్రం రచయిత తప్పు పట్టటం లేదు. అసలీ వ్యవస్థే సిగ్గులేకుండా కొయ్యగుర్రంలా ఊరేగుతోంది. దాన్ని ధ్వంసం చెయ్యండి అని తుఫాను బీభత్సాన్ని చిత్రించి ఇదిగో ఇదిలా జరిగింది. ఇటువంటివి ఇకముందు ఇలా జరగకుండా వుండాలంటే దాన్ని తగలబెట్టాలి. మరో మార్గం లేదని కవి సూచిస్తాడు. పెనుతుపానులో చావకుండా బతికి బయటపడిన అలగాజనం బ్రతుకుల్లోని విషాదాన్ని ఈ కావ్యం అంతగా ధ్వనించదు. చచ్చిపోయిన వారికోసం ఏడవకుండా బతికున్న వాళ్ళకోసం ఏడిస్తే ఈ కావ్యం బాగుంటుందని మరికొంతమంది మెచ్చుకునేవారు. అసలిట్టాటిని కావ్యంగా మలచాలా? అలా చేస్తే ఏం మిగులుతుంది? అందులోంచి ఆధునిక మహాకావ్యాన్ని వండటం అవసరమా? అనే ప్రశ్నల ముళ్ళ కంచల్ని దాటి కావ్యంలోకి ప్రవేశిస్తే మానసాకాశంలో అతను ఏయేవి చూసి, ఏయేవి వూహించాడో, ఏయే కల్పనలు చేశాడు అవి మాత్రం ఈ రచనకు పుష్టినీ, తుష్టినీ సమకూర్చాయి.

పొలం వెళ్ళే ప్రతిరైతూ శిలువ మోస్తున్న జీసస్‌లా నగ్నమునికే కన్పిస్తాడు. అందుచేత కూడా అతని తాత్విక పరిధిని సంకుచితంగా చూసి మత ప్రతీకల్ని వాడాడని గోలపెట్టవచ్చు. గోల పరమేశ్వరులంతా కొయ్యగుర్రం మీద

పూరేగేవారే. చివరి విందులో చివరికి తన నెవరు మోసం చేస్తారో జీసస్‌కి తెలుసు అని అన్నందుకూడా నగ్నమునిని తప్పు పట్టవచ్చు. అలాగే "సకల సంపదల్ని పరిత్యజించిన సిద్ధార్థుణి రాజ్యం పొలిమేరవరకూ చేరవేసి తిరిగొచ్చిన అశ్వం అశ్రునయనాల్తో నాగార్జనకొండలో యింకా నిలబడే వుంది. మానవుని మనసులో మాత్రం మహాబోధి యెప్పుడో కూలిపోయింది" అని అన్నందుకు అతణ్ణి మార్క్సిస్టులు వేళాకోళం చేయవచ్చు. కాని నేను మాత్రం కలం పక్కన పెట్టి నమస్కరిస్తాను.

(3-10-1980 తేది ఆంధ్రజ్యోతి వారపత్రిక నుండి)



# KOYYAGURRAM
# A Long Poem in Telugu By NAGNAMUNI

**- M. Syamala Rao**

The madness of art as Henry James called it. That is what it is; Nagnamuni's *Magnum opus* so far - that rider 'so far' is necessary - Koyyagurram (wooden horse).

Nagnamuni gave all he could and all he thought he should in one big flush of anguish, despondeney and a last lingering flare of hope and promise. The promise and hope are for the future, which may be tomorrow or a millennium from now. But he is in a hurry; he cannot wait. The anguish, the desolation and rage, they stick. The poet must have worked in an orgy of passion, darkness, overpouring grief and a new religious frenzy.

November 19, 1977 sparked off the big burst. It was the trigger that let off the force to create Nagnamuni's universe as painted in his "Koyyagurram". The words were beautiful. Ironically they were the elements chosen by him to re-create for us the ghastly realities of the day and all that followed in one terrible flux. That particular day was only casual in an incidental way - as mentioned in Prof. Chekuri Ramarao's incisive introductory analysis - it could have been any other day. The poet carried the tumeiscence within himself as long as he could. The downpour had to come and it did in a big gush, like lava from Krakatova, in the form of Koyyagurram, *Wooden Horse* (Don't confuse it with the transitory *Trojan Horse*, this horse is more dangerous and abiding; more wily and has greater built-in capacity for survivial; its teeth sharper and bite deeper).

Horse is the symbol for speed, faith, success and efficiency)

But Nagnamuni's *Wooden Horse* is not merely the establishment, it encompasses much more than that: you, he and

I are part of the horse. Our superstitions, ennui, pigheadedness, ego, greed and ignorance are also symbolised by the wooden horse. Drunk with pelf and endowed with a wooden heart and iron heels it tramples under foot the weaklings of the earth.

The consciousness of the power and powerlessness of words at the same time drives the poet to choose his words with care and caution.

He says : *Poetry is crematorium's operator*
*incinerates letters on paper*
*every alphabet the poet disgorges*
*comes out only after snuffing out*
*the thought-embryo*
*it paints the poet as the murderer*
- - - - -
*the true poet looks*
*with suspicion*
*all letters of the alphabet*

Armed with the power of the word he croses words with the powerful wooden horse which rattles a wooden sword. And can you stand the truth that his song lays bare?

*I sing the same song again and again*
*Yes, I repeat it till life's end*
*I pluck out my gut*
*and roam all around*
*playing on the single stringed lyre*
*I shall traverse the length of the world*
*on a wing of air in search*
*of an ear that can stand the truth*

An how harsh is that truth? The midnight hour. The language spoken all over the world is the same; the language of love, two being merging into one, existence losing its separateness and acquiring an etereal dimension. Strange dreams creep under and emblazon the skin. Man snuggles up to the woman and the child puts its mouth in search of the mother's breast. Well, all this is unreal. The sudden bust of the ocean in a myriad forceful thrusts on the heads of the trampled is the only truth. The silence of the vast readymade graveyard is the only reality - the reality that cannot be wished away by the unthinking technological jungle

around us. The man with the plough, the one in the humble hut, on the pavement - there is not rescue team, no salvage operation. None can coax life into a corpse - a corpse real as well as metaphorical.

In Nagnamuni's words :

*Life becomes the plough,*
*burrows deep wrinkles*
*in the skin and*
*the alchemy of experience*
*reaps the crop of gold*
*but all invain for the one*
*that created this gold -*
*He stands deprived*
*with weeds on his palette.*

The devastation caused by the frightful combination of forces by the million hydra-headed sea and equally harsh wooden horse is total and-

*sometime*
*when these weed grown soils*
*get upturned*
*there turns up a skull*
*with its teeth bared*
*in a grimace of laughter*
*but don't worry*
*carcasses demand*
*no explanations*

But the Wooden Horse knows the truth and the secret is shared by the wave of the sea. Yet, the truth remains unprofessed.

*Jesus knows*
*who betrays him*
*in the last supper*
*I know the killers*
*is there an identity of 'I' and Jesuse?*

The poet in the end comes up with a counter-weapon, may be the ultimate one; the weapon that destroys all other weapons. It is sure to destory the wooden horse. "I come with universe fabric taking is new dreams, new values systems and a new faith, to cover the naked body of the Man."

Nagnamuni's imagery has a vitality and orignality that freshens up the air. My quarrel is only with the montage of the poem. I am uncomfortably jerked and jolted as I travelled along the path cut by him. I had to go back and forth to discover my coordinates and know the lay of the land. But I suspect he resorted to this consciously to put me wise to the ruggedness of the road and the many backslidings enroute. It is no idyllic of gettting at the blue bird.

At the end of the book Vegunta Mohan Prasad got into the spirit of this long poem and made the journey alongside of Nagnamuni.

Nikita Gurov who teaches Telugu in Leningrad University wrote about the 'Poetic vision of Nagnamuni' with perspicacity but in simple words.

The depth of the seas and this long poem's wide ranging spectrum are reflected in the foreword written by Prof. Chekuri Rama Rao.

Manohan Dutt's horse on the cover tramples underfoot bloated dead bodies, it has on its face an expression of a horse in heat.

(From Deccan Chronicle Dt. 2nd March 1980)



**నగ్నముని**
గురించి
రేఖామాత్రంగా
కొన్ని వివరాలు

- అసలు పేరు– మానేపల్లి హృషీ కేశవరావు
- బంధువులకి, చిన్ననాటి మిత్రులకి – హృషీ
- సాహిత్యంలో – నగ్నముని
- అమ్మ, నాన్న – మానేపల్లి సంగమేశ్వరకవి
  లక్ష్మీకాంతమ్మ
- జననం – 15-5-1940 : తెనాలిలో
- బాల్యం – మచిలీపట్నం (బందరు)
- చదువు – హైదరాబాదులో బి.ఎ., సాంకేతిక విద్యలు
- ఉద్యోగం – పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షలో ఎంపిక.
  ఆం.ప్ర. శాసనసభలో వెర్బాటిమ్ రిపోర్టర్‌గా
  1958లో నియామకం.
  తరువాత చీఫ్ రిపోర్టర్‌గా, అసిస్టెంట్ సెక్రటరీగా,
  డిప్యూటీ సెక్రటరీగా, జాయింట్ సెక్రటరీగా
  పదవుల నిర్వహణ. 1998లో పదవీ విరమణ చేశారు.

- ఈ దారిలోనే సమాంతర ఉద్యమ విలువల ప్రయాణంలో రచించిన...
  కవితలు, కథలు, వ్యాసాలు, నాటక నాటకీకరణలు,
  ఆకాశవాణి ప్రసారాలు, ఇంటర్వ్యూలు, సినిమా మూలకథలు,
  వారం వారం, నెలనెలా వెలువరించిన విశ్లేషణా రచనలు,
  ముఖ్యంగా ప్రారంభించిన, కొనసాగించిన సాహితీ
  ఉద్యమాలు:

– మొదటి కవిత – 'సౌందర్యపు స్వగతం'
1957 నవంబరు, 'తెలుగు స్వతంత్ర'లో ప్రచురణ.

– మొదటి కవితా సంపుటి – 'ఉదయించని ఉదయాలు'
1962లో వెలువడింది.
– రెండవ కవితా సంపుటి –'తూర్పు గాలి' 1972లో.
– మొదటి కథల సంపుటి – 'నగ్నముని కథలు' (16) 1973లో
వెలువడింది.

– రెండవ కథల సంపుటి – 'విలోమ కథలు' (6) రచన, వివిధ పత్రికలలో ప్రచురణ ప్రారంభం ఎమర్జెన్సీ కాలంలో. 1979లో మొదటగా సంపుటిగా వెలువడింది. ఇవి ఎమర్జెన్సీపై ఎక్కుపెట్టిన కథలు. విలువలు విలోమమవుతున్నాయని తెలిపే ఆధిక్షేప, ప్రయోగాత్మక, నూత్నశైలీ పరిచయ కథలు.

– పత్రికలలో – ప్రచురింపబడి, పుస్తకరూపంలోకి రాని మరిన్ని కథలు.

– ఆకాశవాణిలో – 1959లో స్వీయవాణి ప్రారంభమైంది. ఇతర భాషల నుంచి కవితలు అసంఖ్యాకంగా అనువదించడం జరిగింది. స్వీయ రచనలు – కవితలు, కథలు, వ్యాసాలు, ఇంటర్వ్యూలు ప్రసారం చేశారు. శ్రవ్య నాటిక నాటకాల్లో పాల్గొన్నారు. 'ఎ' గ్రేడ్ ఆర్టిస్టుగా వర్గీకరింపబడ్డారు.

– ఉత్తమనటుడిగా

1960 దశకం మొదట్లో, ఆం.ప్ర. సచివాలయం అంతర్‌శాఖా నాటిక, నాటకాల పోటీలో 'చతురంగ' నాటికలో ఉత్తమ నటుడిగా ఎన్నికయ్యారు.

– దృశ్యంగా నాటకీకరణ

1974లో, మొదటిసారి, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' బృహన్నవలను ప్రదర్శన నిమిత్తం నాటకీకరణ చేశారు. 109 ప్రదర్శనలు యివ్వడం జరిగింది. 'నిత్యనాటకం ఒక ఉద్యమం'లా కొనసాగాలనే భావనకు ఉదాహరణగా నిలిచింది.

– శ్రవ్య నాటకీకరణ

1975లో, ఆకాశవాణిలో ప్రసారం నిమిత్తం ఉన్నవ వారి 'మాలపల్లి' నవలను తిరిగి శ్రవ్య నాటకంగా రచించడం జరిగింది.

– స్వీయ నాటకం – 'ఇక్కడ కలలు అమ్మబడును'. పూర్తి నాటకం రచించారు. థియేటర్ ఆఫ్ ఆర్ట్స్ విద్యార్థులు ప్రదర్శించారు.

– సినిమాలకు – 'మరోచరిత్ర', 'ఎం.ఎల్.ఎ. ఏడుకొండలు', 'త్రిశూలం', 'ఉదయం' మొదలైన సినిమాలకు మూలకథలను రచించారు.

– వారం వారం

'ఉదయం'దినపత్రికలో 'అక్షరాయుధం' శీర్షికతో, 'ఆంధ్రప్రభ' – దినపత్రికలో 'చేదుమాట', 'నగ్ననేత్రం' శీర్షికలతో లఘు వ్యాసాలు రాశారు.

– నెలనెలా

'నడుస్తున్న చరిత్ర' మాసపత్రికలో 'వ్యవస్థ– మరోకోణం'

శీర్షికతో-ప్రధానంగా సామాజిక, రాజకీయఅంశాలు విశ్లేషించారు.
'చినుకు' మాసపత్రికలో 'నగ్నవీక్షణం' శీర్షికతో సాహితీ అంశాలు రచించారు.

– అరెస్టు : 1975 ఏప్రిల్‌లో జరిగిన 'ప్రపంచ తెలుగు మహాసభలు' సమయంలో, ప్రజాకవులు, రచయితలపై ప్రభుత్వ అణచివేత ధోరణిపై నిరసన తెలిపిన వారితో అరెస్టు చేశారు. ఇతర సాహితీవేత్తల వత్తిడితో 38 గంటల తర్వాత విడుదల చేశారు.

– నిఘా : 1975 జూన్ 25 అర్ధరాత్రి ఎమర్జెన్సీ విధించబడింది. వీరి రచనలపై (ముఖ్యంగా 'విలోమ' కథలపై) ఉపన్యాసాలపై, కదలికపై నిఘా మరింత ఎక్కువ చేశారు.

– ఉద్యోగం నుండి తొలగింపు : 1975 డిశంబరు 22వ తేదీన ఉద్యోగం నుండి డిస్మిస్ చేశారు.

– తిరిగి నియామకం : లోక్‌సభకు తిరిగి ఎన్నికలు జరిగి, కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పడ్డాక, 18 నెలల తర్వాత, తిరిగి ఉద్యోగంలో నియమించబడ్డారు.

**సాహితీ ఉద్యమాలు :**

దిగంబర కవితోద్యమం

1965లో, నగ్ననామ సంవత్సరంలో, మరో అయిదుగురు కవుల్తో దిగంబర కవితోద్యమం ప్రయోక్తగా ప్రారంభించారు. మూడు కవితా సంపుటాలతో, 1970 వరకు ఈ ఉద్యమం ప్రత్యక్షంగా కొనసాగింది. దుర్మార్గ వ్యవస్థలపై, రాజ్యంపై సమాజంలోని అసమానతలపై ఈ ఉద్యమం ఇంకా పరోక్షంగా కొనసాగుతూనే ఉంది.

విరసం– 1970లో ఏర్పడిన విరసం వ్యవస్థాపక సభ్యుల్లో ఒకరు.

కొయ్యగుర్రం – తొలి ఆధునిక మహాకావ్యంగా, తొలి రాజకీయ, తాత్విక మహాకావ్యంగా, కావ్యాలకు, దీర్ఘ కవితలకు ఒరవడి పెట్టినదిగా వినుతికెక్కినది 'కొయ్యగుర్రం'.

మొదట ఆకాశవాణిలో ప్రసారం 1977 నవంబరులో.
'ప్రజాతంత్ర' వారపత్రికలో ప్రచురణ 1978 జనవరిలో.
మొదట పుస్తకరూపంలో వెలువడింది 1980లో.
రెండవ ముద్రణ 1998 నవంబరులో
మూడవ ముద్రణ 2007 జనవరిలో
'కొయ్య గుర్రం' కావ్యాన్ని రూపపరంగా, వస్తు విషయకంగా ఒక 'ఉద్యమంగా' భావించడం జరిగింది. నూతన సమాజ, రాజ్య, తాత్త్విక భావనలు

ప్రవేశపెట్టడం వల్ల, మొదట పుస్తక రూపంగా వెలువడినప్పటి నుండీ చర్చోపచర్చలు జరుగుతూనే ఉన్నాయి.

ఆధునిక కవితారంగంలో ఇంతటి చర్చ ఏ కావ్యంపై జరగలేదు.

ఇప్పటివరకు రష్యన్, ఇంగ్లీష్, హిందీ, పంజాబీ, మరాఠీ, మైథిలి, ఒరియా, తమిళం, కన్నడం భాషల్లోకి అనువాదమైంది.

ప్రజాస్వామ్యకవిత – నిజ ప్రజాస్వామ్య వ్యవస్థాపనోద్దేశంతో, ప్రజాస్వామ్య భావనలు వెదజల్లుతూ, 'ప్రజాస్వామ్య కవిత' ప్రారంభిస్తూ, 'జమ్మిచెట్టు', 'అద్వైత రాజ్యం' మొదలైన ఎన్నో దీర్ఘకవితలు, వ్యాసాలు ప్రచురించారు.

– 1990లో 'ప్రజాస్వామ్య పరిశోధనా కేంద్రం' పేర ఒక వేదికను ఏర్పాటు చేసి, వివిధ రంగాలకు చెందిన మేధావులతో ఉపన్యాసాలిప్పించారు. స్వయంగా ఉపన్యాసాలిచ్చారు.

తాత్త్విక దృష్టి : ప్రతి జీవనాంశాన్నీ తాత్త్విక దృక్కోణం నుండి వీక్షించడం, ప్రత్యామ్నాయ, మానవ విలువల వ్యవస్థల ప్రతిపాదనకై కృషి చెయ్యడం ఆయనకిష్టం.





koyyagurram

epic in telugu

nagnamuni

కొయ్యగుర్రం

తొలి రాజకీయ తాత్విక కవిత.

విమర్శకులు దాన్ని మహాకావ్యం అన్నారు.

వచన కవిత ఒక రూపంగా గట్టిగా

నిలదొక్కుకుందంటే దానికి కారణం

కొయ్యగుర్రం

(సుప్రభాతం-5 మే 1992)